# మహాభక్తవిజయము.

(గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు)

"బెజవాడ సరస్వతీ నాట్యమండలివారు" అద్భుతమైన సీనరీతో ప్రదర్శించు నాటకరాజ మిదియే!

ఇది ఐదుగురమహాభక్తుల సంపూర్ణ చరిత్రములతోఁగూడిన ఏకరాత్రప్రదర్శనమగు నాటకము! నాటకము, ఆదినుండి అంతమువరకును, రక్తిచెడకుండ నవరసములతో కడురమ్యముగ రచింపబడినది. 1. గజేంద్రమోక్షము. 2. పరీక్షిత్తు. 3. భక్తకుచేల. 4. మార్కండేయ. 5. ధృవ అను కథలీనాటకమునకు, ఐదును ఐదంకములుగా విభజింపఁబడినవి. రమ్యమగు సీనరీచేయించుకొని నాటకప్రదర్శనముచేయగల సమాజముల కొఱకై, ఇది ముఖ్యముగ రచింపబడినది. ప్రతి అంకాంతమునందును అశ్చర్యకరమైన గొప్ప సీనరీచూపుట కవకాశముగలదు. గానమునకై కాంక్షజెందు గాయకనటుల యుపయోగార్థము, నేటికాలపు సుప్రసిద్ధ మరాఠ్, హిందూస్థానీ గాయకుల ప్రసిద్ధగానములకు అనుకరణములు 60 గలవు. భావప్రియులకు మనోరంజకముగా సర్వత్ర చక్కనిభావములు గలవు. పండిత పామర జనరంజకమగు హాస్యము రంగ రంగ మధ్యము నను వెదజల్లబడినది. భక్తులకు ముదావహమగుభంగిని నాటకమంతయు భక్తిరసప్రధానముగ నుండును. ముద్దులొలుకు పద్యములు! ముక్తామణులవంటి గద్యములు! రసభరితములగు భావములు! రమ్యములగు గానములు! రంగస్థలమున పేరెన్నికగన్న మహానాటకము! చదువదగినది! పాఠముచేయదగినట! అన్ని విధముల తగినది! ఒకకార్డువ్రాసి నేడే యొకగ్రంథముం బడయుడు. వెల రు 1—0—0 మాత్రమే.

దొరకుచోటు:—కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

ఓం.

# కాలకేతనము


గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావు.





ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు:

సరస్వతీ బుక్కుడిపో—బెజవాడ.

ప్రథమముద్రణము 1,000.

1934





(వెల 1-0-0

# పాత్రలు.

## —◆ పురుషులు ◆—

1 కాలకేతనుఁడు—రాజు.

2 నీలకంఠుఁడు—రాజశ్యాలకుఁడు; మంగళసోదరుఁడు.

3 మృగేశుఁడు—ఒగదొంగ; జూదరి: మధుపాయి.

4 అగభాషి—రాజసేవకుఁడు. (నీగ్రో)

5 ఉదయాదిత్యుఁడు—చాళుక్యరాజు.

6 గంగాధరుఁడు—ఉదయాదిత్యుని మిత్రుఁడు.

7 పాషండుఁడు—ఒకజూదరి.

8 రూపచందు—రూపలితండ్రి.

9 శాంతికేతనుఁడు—ధారుణీ కాలకేతనుల కుమారుఁడు.

10 బాలుఁడు—రాజుచే తుదసారి హత్యచేయఁబడినవాఁడు.

11 ఒక సేవకుఁడు—

## స్త్రీలు.

1 సులోచన—కాలకేతనుని పట్టపుదేవి.

2 మంగళ—కాలకేతనుని రెండవభార్య.

3 రూపలి—ఒక ఆదిమాంధ్రబాలిక. (బానిసగాతేఁబడినది.)

4 ధారుణి—కాలకేతనుఁడు వదలివేసినభార్య.

5 పంకజ—మంగళసఖి.

6 మణికుండల—ఉదయాదిత్యునిరాణి.



# కాలకేతనము.

## ప్రథమాంకము.

---

రంగము i—కాలకేతనుని శిబిరము.

ప్రవేశము—(మధుపానముచేసి, సుఖాసీనులై యున్న కాలకేతన, నీలకంఠులును—ప్రక్కగా ఆగభాషియు.)

కాల—ఆగభాషీ!—మనచే జయింపఁబడిన చాళుక్యరాజగు ఉదయాదిత్యుఁడు, మా యానందముకొఱకు, పంపెదననిన బానిసలు వచ్చిరా?

నీల—ప్రభూ!—ఏకారణముననో, కొంచెము ఆలస్యమైయుండునే కాని, పంపకుండుటకు వానికి గుండెలున్నవా?

కాల—ఆగభాషీ! నీ యుద్దేశ్యమేమి?

ఆగ—ప్రభూ!—మీసేవకుని కెట్లు తెలియఁగలదు?

నీల—ఆగభాషికి, ఆలోచనము మిక్కిలి తక్కువ ప్రభూ! వీని నొక పీపా సారాయిలో ముంచినచో, మంచి తెలివితేటలు లబ్బఁగలవు.

ఆగ—నాకెందులకు? సేవకమాత్రుఁడను. ఇంతవఱకు, నీవొక లక్ష పీపాలు పీల్చివేసి గణించిన తెలివితేటలు కనఁబడుచున్నవి గాదా? ఒంటెవలె, నొక్కసారిగా త్రాగి నిలువజేసికొనుము.

కాల—(నిషాచే నవ్వుచు) హేహేహేహే!—ఆగభాషి, మా నీలకంఠునకు, మంచి బిరుదము నిచ్చినాఁడు.

నీల—(కోపము నణచుకొని స్వగతము) ఉండుండు. ఎప్పుడో, నీకు సయుత మింతకన్న—మంచిబిరుదము దొరుకునులే! తొందఱ పడకు.

(తెరలో, అశ్వఖుర ధ్వని)

ఆగ—ప్రభూ!—ఉదయాదిత్యునిచే పంపఁబడిన బానిసలు వచ్చినారు.

కాల—నీలకంఠా! ఇంక లెమ్ము.

(అందఱును లేతురు—తెరలేవఁగా, బానిసలు కనఁబడుదురు. బానిస లలో రూపలితప్ప-అందఱును, కాలకేతనునకు నమస్కరింతురు.)

ఆగ—(రూపలినిచూచి) ఓసీ! నీవు కడుబింకముగ నిలువఁబడియుంటి వేల? ఎవ్వరి సముఖమునకు నీవు బానిసగా తేఁబడితివో యెఱుఁ గవా?—కాలకేతనమహారాజునకు నమస్కరింపుము.

రూప—ఎవ్వఁడురా నాకు మహారాజు?—ఈ హీనుఁడు, నాకెట్లురాజ గును? అభిలాషలేని యబలలు మొఱ్ఱోయనుచుండగా—వారి బంధువులకెడఁబాపి, బలాత్కరించుట రాజలక్షణమా? కఠిన కర్ముఁడగు నీ కాలకేతనుఁడేమి నాకు మహారా జగుటయేమి? నేను నమస్కరింపను.

ఆగ—ఆఁ! ఏమి ప్రేలుచుంటివి? నీకు పాదరక్షప్రయోగము కావల యునా?

(చెప్పుతోఁ గొట్టబోవును.)

రూప—(కత్తిలాగి) ఓరీ! నరపశువా! ఏదిరా నీ పాదరక్షప్రయోగము! నీ వీ కటారిపోటునుండి కాచుకొని, బ్రదికిన పిదప, నీ పాదరక్ష పసఁ జూతము.

(పొడువఁబోవును.)

నీల—(వెనుకనుండి రూపలి కత్తినిఁబట్టుకొని,) ఓసీ! హంతకీ! ఏమే నీసాహసము? ఎవరిపై విజృంభింపఁ దలఁచుచుంటివో యెఱుఁ

గుదువా? మృత్యుదేవతతోడనా నీసయ్యాటలు!—వచ్చినదా నవు చచ్చినట్లు—పడియుండుము.

కాల—(తీవ్రదృష్టితో ముందునకువచ్చి) ఏమి యీచిత్రము!—ప్రచండశాసనుఁడగు నీ కాలకేతనుసియెదుట నొకయబలయీ సాహసముఁజూపునది?........దుష్టా! ఎఱిఁగి యెఱిఁగి, మరణమును కంఠముపైకిఁ దెచ్చుకొనుచుంటివా? ఆఖడ్గము నిట్లిమ్ము—

రూప—(ఖడ్గమునిచ్చి తలవంచును.)

కాల—(కత్తిని దూరముగ విసరివేసి) ఈకత్తియా నావజ్రసమప్రాణములం దీయఁ గలుగునది? ఎవ్వతెవు నీవు?—

రూప—నే నొక నిరుపేదయగు మాలవాని తనయను.

కాల—నీపేరేమి?

రూప—రూపలి.

కాల—రూపలి? రూపలియా! నీపేరెంత కర్కశమో—బుద్ధియు నట్టిదే! నీకు వినాశకాలము సమీపించినది. తొందరపడకు.

రూప—వినాశకాలము వచ్చినందుననే, నీచేతఁజిక్కితిని. దిక్కులేని నన్ను చంపిన, నీకెంత విఖ్యాతియో యెఱుఁగవా?—

కాల—దిక్కులేనిదానవై నందువలననేనా—నీకింతపొగరు! రాజునైన నాపైఁ గత్తినెత్తుటలో, నీసంకల్పమేమి?—నన్ను చంపుటకేనా?—నాప్రాణములు తీయుటకేనా? ఓ యధమపంచమబాలికా! నీచే చంపఁబడుట కీ కాలకేతనుఁ డంతశక్తిహీనుఁ డనుకొంటివా?—నీప్రాణములిఁక నీకుదక్కవు.

నీల—ఓసి తెలివితక్కువదానా?—ఇప్పుడయిన మహారాజునకు నమస్కరించి, ప్రసన్నునిఁ జేసికొనుము. నీకు మరణము తప్పదు.

రూప—నా ప్రాణములను మీరు తీసికొనినఁ దీసికొనుఁడు. కాని, నేను నమస్కరింపను.

కాల—ఆఁ—ఏమంటివే! శంకినీ! నమస్కరింపవా? ఆలోచించుకొనుము. మండుచున్న విలయాగ్నిని కదలింపకుము. నే నెవ్వఁడనో యిప్పుడైనఁ దెలిసికొనుము.

గీ॥ మున్ను చాళుక్యరాజ్యముల్ ముట్టడించి
వేడ్కఁగ, 'జితోస్మి' యనిపించి విడిచినాఁడ
నెంతదానవు? తులువ! నన్నెదిరిపలుక—
విలయమృత్యువుగా నన్నుఁ దెలిసికొనుము॥— ౧

రూప—ఛీ! ఛీ! నింద్యకర్ముఁడా! ఏమిరా నన్ను బెదరించుచుంటివి? నీ ప్రతాపము, నబలలపైనఁటరా చూపెదవు? నేను నీ పలుకులకు భీతిల్లెద ననుకొంటివా? ఇంతటిపరాభవమైన పిదప—నన్నీ తుచ్ఛజీవితము లుద్ధరించునా? చంపుము, అన్నివిధములగు సుకృతములతోపాటుగా స్త్రీసధాసుకృతము నొక దానిం గూడ తలఁగట్టుకొనుము. (అనుబంధము. 1)

కాల—ఛీ! పరమపాతకీ!—ఇంక, నీయాయువు పరిపూర్ణమై పోయినది—నీలకంఠా! దీనిని సిలువపై బంధించి ప్రాణములు తీయుము. ఇదె నాయాజ్ఞ—పొమ్ము—

(తెర)



రంగము 2—ఒక యరణ్యమార్గము.

ప్రవేశము—ఉదయాదిత్యుఁడు, గంగాధరుఁడు.

( అనుబంధము 2 )

ఉద—మిత్రమా! గంగాధరా! విచారింపకుము. దురాత్ముఁడగు కాల కేతనునకు, చిరకాల మభ్యుదయముకలుగదు. వాని వినాశనము నచిరకాలముననే, విధినిర్ణయించును. మనకు మంచిదినములు రాకపోవు.

సీ॥ సురలను రావణాసురుఁడు బాధింపఁడే
పాపఫలము మ్రగ్గిపండుదాక
కావింపఁడేమున్ను కంసుండు జనహింస
నిజదుష్కృతఘటంబు నిండుదాక
కనక కశ్యపుడు పుత్రునిఁ జంపబూనఁడే
యఘసహస్రములు మిన్నంటుదాక
నహుషుండు సురపాలనం బొనరింపఁడే
ఆత్మనాశన సమయమగుదాక
వేలుపులు కొంతకాలము వెతలబడరె?
అందరే మనఃక్షోభంబు నవనిసురులు?
ఆంధ్రవిజయ సంస్థాపకుఁడైన కాల
కేతనుఁడుగూలు రాక్షసాతీతుఁడగుచు॥

గంగా—ఉదయాదిత్యమహారాజా! మీరేమో ధర్మపన్నము లిట్లే సం తన చేయుచుండుఁడు. వానిదౌర్జన్యములే వానికి విజయకార ణములై యున్నవి. విజయము కలుగవలయుననిన, తీయనిమా టలు పనికివచ్చునా? వృక్షాగ్రమున నున్న ఫలముల నాసించు వాఁడు, ఊలురువ్విన ఫలానుభవము గల్గునుగాని—ప్రార్థనము లచే పండ్లురాలునా? బలమైననాఁగటిచే భూమిని పెకలింపక,

భగవంతునకు మంగళహారతులు పాడుచుండిన క్షేత్రపాలకునకు లాభముగలుగునా?—సన్నిపాతజ్వరము వచ్చినవానికి చేవగల చేదుమందులు—గరిటెదూర్చి నోరుపెకలించి, లోపలకుఁబోయ వలయునుగాని, మంచిగంద మొసలికిఁ బూయనగునా?

గీ॥ ఆంధ్రవిజయదాహమను పిశాచంబు—వ
క్రించి పూను కాలకేతనునకు
తగునుగాక తీవ్రదండప్రహారంబు
శాంతవృత్తిచేతఁ జక్కఁబడునె?॥ 3

ఉద—గంగాధరా! నీతొందఱపా టెల్లప్పుడును ఇట్టిదియే యగును. దక్షిణదేశమునం దెచ్చటనో పేరుప్రతిష్ఠలు లేకుండిన, యీ కాలకేతన హతకుఁడు, మన యాంధ్రదేశమునకువచ్చి—పీఠమును స్థాపించి—పాతుకొనిపోయి, సర్వరాజ్యముం బరిపాలించు చున్నాఁడు. విధిబలమిప్పుడు వానియందు పరిపూర్ణముగ పని చేయుచుండఁగా—వానినిఁ బెకలింప మనకు సాధ్యమగునా? పరాజితులమైన మన మిపు డాతులువ నెట్లెదుర్కొనగలము?—ఇది ప్రశస్తమైన యోచనయా?—ఇట్టిసమయమున, మనమణఁగి యుండకున్న కార్యసాధనము చేయఁగలమా? కాలవశమున, కారుమబ్బులుగ్రమ్మినపుడు, సూర్యచంద్రులంతటి తేజోమయులైతము, నిస్తేజులై—మబ్బుతొలఁగినంతనే, తమ తొంటి తేజమునఁ బ్రకాశింపకుందురా? అటులే కొలదికాలముననే, చాళుక్యవిజయమును మీరు చూడఁగలరు. ఈకాలకేతనుని పాపపరిపాకకాలమును మీరు ప్రతీక్షింపుడు. కాకున్న సైన్యములులేక, రాజ్యములేక, వాహనములులేక, ఆయుధములులేక అన్నివిధములచే నసహాయదశయందున్న మన మేరీతి వీనిని నిర్జింపగలము?

సీ॥ సకలాస్త్రలాభ ప్రశస్తిగల్గినవారి
నాయుధంబులులేక నడఁపఁగలమె?
దీపితాపార సేనా పరివృతుని
నేసేనలు లేక నిర్జింపఁగలమె?
నిలచుటకింత భూతలమైన లేకయే
మన శాత్రవునిఁ బరిమార్పఁగలమె?
కవచరక్షితుఁడై ప్రకాశించువాని
నిస్తేజదుస్థితియందు జెనకనగునె?
మంచిచెడ్డల నెద విచారించకుండ
సాహసంబున నెంతైన సలుపనగునె?
క్షితిని, చాళుక్యరాట్కళంకిత యశస్సు
సామమునఁగాక తేజః ప్రధామమగునె?— ౮

అందులకే, నీవును—వేచియుండుము.

గంగా—మీయాజ్ఞ మీరను—మీరను.

(రూపచంద్రుఁ ప్రవేశము.)

రూప—(కోపముతో) చాళుక్యరాజగు నుదయాదిత్యుఁ డెక్కడ? చాళుక్యరాజగు నుదయాదిత్యుఁ డెక్కడ?—

ఉద—ఏమి యీ వికారాకారము? ఈతఁడెవ్వరోకదా!

గంగా—ఓయీ! ఈయనయే ఉదయాదిత్యమహారాజు; నీవెవ్వఁడవు?

రూప—నేనెవ్వఁడనో మీరెవ్వరు నెఱుఁగరా? ఎఱుఁగకయే నాకొంపఁ గూల్చితిరా? ఎఱుఁగకయే నాగొంతుగోసితిరా? నాబిడ్డా! రూపలీ! రూపలీ! చాళుక్యుల యుసురులకేడ్చుచు, నీవు—ఘోర దుర్మరణము పాలగుచుంటివా? తల్లీ!—నీవృద్ధజనకునకు, పది కొంపలుతిరిగి మాధుకరమైనఁ దెచ్చిపెట్టుగతి యింకెవ్వ రున్నారు?—నాకడుపున చిచ్చుబెట్టిపోయితివా?—ఓరీ! ఉద

యాదిత్యా! నీవు నాకుటుంబనాశనము చేసితివిరా! నాగొంతు పటపట తెగని అంపమున—సగముకోసి వదలితివిరా!—కాల కేతనుని సిలువ కాలిపోవకముందే, నారూపలికి దానిపయి మరణము గలుగనున్నదా?.........అయ్యో! రూపలీ! రూపలీ! రూపలీ!—

ఉద—అయ్యా! నీవెవ్వఁడవో నే నెఱుఁగను. నేనే యుదయాదిత్యుఁడను. నీదుఃఖమును నాకెఱిఁగింపుము. నేను నీకుఁజేసిన ద్రోహమేమో తెలియఁజేయుము. ఎఱుగక చేసినదానిని సవరించుకొందును. ఏమిచేసితిని?

రూప—ఏమిచేసితివా?—ఏమిచేసితివా?—ఏమిచేయవలయునో అదియే చేసితివి. ఇంతకన్న—నాకు, నీ వధికాపకారమేమిచేయఁగలవు?-నాకన్నబిడ్డ కాలిపోవుచుండఁగా నీవుచేసిన యపచారమునెట్లు సవరించుకొనఁగలవు?—కాదు; కాదు. నీవు నాకు తీరనియపకారముఁజేసితివిరా ద్రోహీ!—నిన్నుక్షమింపను—నిన్ను చంపెదను. ఈవట్టిచేతులతో నీమెడపిసికిచంపెదను. (ఉదయాదిత్యుని మీఁదికివచ్చును.)

గంగా—ఎవఁడవురా మాప్రభువును చంపుటకు వచ్చెదవు? చచ్చితివి కాచుకొమ్ము.

రూప—(ఆవేశముచేత మూర్ఛిల్లును.)

ఉద—గంగాధరా! ఆవృద్ధుని చంపకుము. ఆతనిహృదయమునకు పాపమేదియో దారుణదుఃఖము నాటినది. కాకున్న నిట్లు మాటాడఁడు. ఇంతటి యావేశమునకు కారణముగా మన మీతనియందేదియో—అపరాధముఁ జేసితిమి. విచారింతుముగాక!—వీఁడు నన్ను చంపఁగలడనుభీతిని మానుము.

సీ॥ రక్తమాంసాభావ శక్తిహీనంబయి
ముడుతలుపడినట్టి యొడలివాఁడు;

చలికాలమందు వృక్షమువోలె
పండిరాలిన లవకేశముల్ గలుగువాఁడు;
ఆఁకలిచే వెన్నునంటి లోనికిఁబోయి
నట్టి డొక్కలుగల్గినట్టివాఁడు;
కడుమాసి, వేయిచిన్నులు మాసికలు
గల్గియున్న చేలముఁగట్టియున్నవాఁడు,
పైఁబడిన జరాభరమున ప్రాణమెపుడు
వెడలిపోవునో యంచుఁ దోఁపించువాఁడు;
వృద్ధుఁడును—దుఃఖజీవి—దరిద్రుఁడితఁడు;
సంభ్రమముగాక, నన్నెట్లు చంపఁగలఁడు?॥—

రూప—(లేచి) నా రూపలి యెందుబోయినది? దుర్మార్గుఁడా! కాలకేతనా! నీ సిలువకు, చిచ్చుబెట్టెద నుండుము.

(పోఁబోవును.)

ఉద—(పట్టుకొని) వృద్ధుఁడా! పరుగెత్తకుము. నామాటకు త్తరమిమ్ము.

రూప—ఏమిలాభము?—నీమాటలకు, ప్రత్యుత్తరమిచ్చిన యెడల, నారూపలి నాకు లభించునా? నా కుటుంబనాశకుఁడవు నీవు గావా? నారూపలిని, కాలకేతనుని పిశాచహస్తములం బడవైచి ఇప్పుడు సిలువపై—దానిప్రాణములను తీయింపనున్నది నీవు కాదా? ఏమిలాభము నీమాటలు విని?—నన్ను పోనిమ్ము; నన్ను పోనిమ్ము.

ఉద—పోవచ్చును—నేనెట్లు నీ రూపలిని కాలకేతనుని హస్తములం బడవైచితినో చెప్పుము.

రూప—నేను చెప్పను; నన్ను పోనిమ్ము.

ఉద—చెప్పినదాక నిన్ను విడువను.

రూప—(దుఃఖించుచు) అయ్యో! నా కిదియేమిగ్రహచారము? ఓబ్రహ్మరాక్షసుఁడా!—నీకు నమస్కరింతును. నన్ను వదలుము.

నాబిడ్డ—రూపలి, నిమిషములో చావనున్నది. దానిని, కడసారి చూచివచ్చెదను. నన్నువదలుము.........హా! హా!! నాలుక పిడుచవారినది. గొంతుక తడియారినది. దాహము—దాహము—

(మూర్ఛిల్లును.)

ఉద—గంగాధరా! జలము—జలము—

గం—(తెచ్చిత్రాగించును.)

రూప—(నీరుత్రాగిలేచి) చాలు; చాలు—హా! పుత్రికా! రూపలీ! నీ ముసలితండ్రి నేమిచేసిపోయెదవమ్మా! నాకిఁక, దిక్కెవ్వరే తల్లీ! నన్నుచంపువారీభూమిపై నెవ్వరునులేరా?

ఉద—ఓయీ! శాంతింపుము. శాంతింపుము. ఇట్లునమ్మత్తుఁడవై యున్న ప్రయోజనమేమున్నది. నీచరిత్రమును, నాయపరాధమును సావకాశముగ నెఱిఁగింపుము.

రూప—(దిశలఁబరికించి) నీవేనా యుదయాదిత్యుఁడవు?

ఉద—ఔను.

రూప—ఎంతపని చేసితివయ్యా! ఎంతపని చేసితివయ్యా!—పంచముఁడని, మాలవాఁడని, కడజాతివాఁడని, అగ్రివర్ణముల పేరుపెట్టుకొని—విట్టివీగు చండాలురు, మమ్ము గుమ్మముఁ ద్రొక్కనీయక వెడలఁగొట్టినను, నీరాజ్యమున, మాకింత నిలువనీడ దొరుకుచుండెనుగదా! అట్టివానికి, నాకు, తీరని యుపకారము చేసితివా?

ఉద—తండ్రీ! నీవు—ఆదిమాంధ్రుఁడవా?

రూప—ఊఁ—ఊఁ—

ఉద—నీపేరేమి?

రూప—రూపచందు.

ఉద—నీకు, "రూపలి" యను నొక కుమార్తెగలదా?

## ప్రథమాంకము.

రూప—ఊఁ—ఊఁ—

ఉద—ఆమెను కాలకేతనున కెవ్వరప్పగించిరి?

రూప—ఇంకెవరు? నీవు—నీవు—నీవప్పగించితివి. దానిని, చంపించు చుంటివి. నన్నుగూడ చంపింపుము. కాక—నీవైనఁ జంపుము.

ఉద—నేనేల కాలకేతనునకు నీతనయ నప్పగించియుందును?

రూప—ఏలనో—మదోన్మత్తతచేత కాబోలును!

ఉద—హరిహరీ! గంగాధరా! ఇది యేమైయుండును?

రూప—బానిసగా నప్పగించితివఁట!

గంగా—కాలకేతనుఁడు, మనలను జయించిన పిదప—బానిసలఁ బంపుమని వార్తనంపఁగా—మనము, ప్రత్యుత్తర మీయమైతిమి. భటులు, కాలకేతనునకు వెఱచి, తమ యిచ్చవచ్చిన స్త్రీ పురుషులను కొల్లగొనిపోయి, తమ ప్రభువునకిచ్చిరి. అం దీతని పుత్రికయగు రూపలి యొకతెయేమో—

ఉద—శ్రీహరీ! ఎంతపాపము చుట్టుకొనినది!—

రూప—నీదేమిపాపము? నాదిపాపము. ఇప్పు డాదుష్టుఁడు నాబిడ్డను సిలువపై చంపనున్నాఁడఁట!మీరందఱానందింపుఁడు. నే నేడ్చెదను. నాబిడ్డా! నాబిడ్డా! రూపలీ! రూపలీ!—(ఏడ్చును)

(తెరలో కలకలము)

ఉద—గంగాధరా! ఆకోలాహలమేమో తెలిసికొనిరమ్ము.

గంగా—(నిష్క్రమించును)

రూప—నేను నాబిడ్డను కడసారి చూచుకొనివచ్చెదను. నన్ను విడువరా? విడువరా?

ఉద—ఉండు, ఆకోలాహల మేమోవినుము.

గంగా—(ప్రవేశించి) కాలకేతనుఁడు రూపలిని—సిలువపై చంపించినాఁడు.

రూప—హా! నాబిడ్డా! నీప్రాణములు పోయినవా?—ఆఁ—ఆఁ—
ఉండుండుము. నీవు పరలోకమున కేగవలదు. నేను వచ్చు
చున్నాను. (మూర్ఛిల్లును)

ఉద—కటకటా! ఎంతఘోరము సంభవించినది!

రూప—(లేచి) నన్ను పోనిండు. నన్ను వదలుఁడు. నన్ను పట్టుకొని బాధిం
పకుఁడు. నాతనయ శవమునైనఁ జూచుకొందును.

ఉద—వలదు. నీవిప్పుడట కేగితివేని నీకు మరణముగల్గును.

రూప—నే నదేనయ్యా కోరుచుంటిని. మరణమునే కోరుచుంటిని. నీవైన
చంపుము—చంపవేమి? చంపుము. అయ్యో! నీకా, కరుణ!
రూపలీ! నాతల్లీ! నాతల్లీ! చచ్చితివా? నేను చచ్చితినే బిడ్డా!—
(మూర్ఛిల్లును)

(తెరపడును)

---

రంగము 3—సిలువ వేయఁబడిన బయలు.

ప్రవేశము—(సిలువపై దిగఁగొట్టఁబడి మరణించిన రూపలి రక్తమునఁ
గనఁబడును. ప్రక్కగా ఆగభాషి తుపాకితో ప్రచారము చేయును.)

రూపచందు—(శోకముతో ప్రవేశించి) అదిగో! నా రూపలి!అదిగో నా
రూపలి!!-నాతనయ ఏసునాథునివలె సిలువపై రక్తముచిందించు
చున్నది. రూపలీ!నీవు మరణించితివా?నీయాత్మ—ఆకాశమార్గ
మున నీలాంబరమును ధరించి—నృత్యరంగిని యగుచున్నది ఎంత
సౌకుమార్యము! ఎంతలాలిత్యము! బిడ్డా!—నక్షత్రమధ్యమున,
నిలిచి—చంద్రబింబమధ్యంగితభాగమును చుంబింప, నుంకించు
చుంటివా! హా!హా! ఏమియది! ఎంతభయంకరము! ఎంతదారు
ణము! కుమారీ! రూపలీ! నీ సుందరాకారము, రక్తపంకిలమై

నా కన్నులకు, భీభత్సముగ, గనంబడుచున్నది. నీయాత్మజ్యోతి అంబరమార్గమున కెగసిపోయినదా? ఎందులకేడ్చెదవు? తల్లీ! కన్నులు తుడుచుకొనుము. ఆంధ్రరాజ్యలక్ష్మి—నీ మరణ మున కేడ్చుచున్నది. దిక్కులు, నీ మృతికిఘోషిల్లుచున్నవి. గగనారామకాంత నీమృతికిఁ గంకణములు రాల్చుచున్నది. నీరక్తబిందువులవలె, కాలకేతనుని రక్తము సయితము స్రవించు గాత! తల్లీ!—నీకళేబరముం జూచినకొలదియు నా గర్భాంతర మునఁ బెద్ద—దావానలము దరికొనుచున్నది. కన్నులనుండి యగ్నిస్ఫులింగసహస్రము రాలుచున్నది. మృతినందియున్నను నీకన్నులు భయంకరముగా నల్లే తెఱచుకొనియున్నవి. ఆనయ నగోళములనుండి వెలువడు శాపజ్వాలలచేనైన కాలకేతనుని దహింపవేమితల్లీ!—ఈశిలువపై నింకనెందఱు చిత్రవధఁ గావిం పఁబడి యకాలమరణకరాళమునఁ బడనున్నవారు! నాకన్నులు తిరిగిపోవుచున్నవి. నాగుండెలు కొట్టుకొనుచున్నవి. ఓరీ! కాలకేతనా! కాలకేతనా! మానవరూప రాక్షసా! నీయంత్య మిఁక దూరములేదు. నాకిఁక వేరుసహాయ మక్కఱలేదు. నాముష్టిప్రహారముల నిన్నుఁజంపెదను. నిలువుము—నిలువుము— అబ్బా! నాకంఠమేల బిగిసిపోవుచున్నది? నాశరీరమేల మండు కొనిపోవుచున్నది!—హా! రూపలీ! రూపలీ!—(మరణించును)

(ఆగభూషి భయముతో నిష్క్రమించును)

(తరువాత—ఉదయాదిత్యుఁడు, గంగాధరుఁడు రభసమున ప్రవేశము)

ఉద—గంగాధరా! పాపము రూపచందు మరణించినాఁడు. నీగ్రో సేవకుఁడు కాలకేతనునితోఁ జెప్పుటకు గాఁబోలు చనినాఁడు. వారు రాకముందు మన మీస్థలమునుండి యీశవమును తప్పిం చవలయును. (ఇరువురునుకలసి శవమును ఎత్తుదురు—తెర.)

ప్రథమాంకము.



# కాలకేతనము

## ద్వితీయాంకము.

రంగము 1 — సులోచనాంతఃపురము

ప్రవేశము—సులోచన, కాలకేతనుడు.

కాల—ప్రేయసీ! సులోచనా! ఇటు కూర్చుండుము. (సులోచన కూర్చుండును) నేను శైవమతస్వీకారముచేసి, నిన్ను వివాహమాడితి ననినమాటయేకాని నీకు తన్మతవాసన యేమియుఁ గాన్పించుటలేదు.

సులో—ప్రభూ! తమరు చదువవలసినదని నాకు శాసించిన శైవమత గ్రంథముల నన్నిటినిఁ జదివితిని.

కాల—గీర్వాణభాష నేమైన నభ్యసించితివా?

సులో—తమకటాక్షమున్నచో, నభ్యసింపఁగలను.

కాల—మంచిది. మనకపాలేశ్వరుని యాలయమునందలి సంస్కృతోపాధ్యాయునులతోడ నీకు పరిచయముఁ గల్గించెదను. నీవు—సంస్కృతము నభ్యసింపుము.

సులో—భాగ్యము.

కాల—(ఒక యుంగరమును తీసి) ఇదియేమో చూచితివా?

సులో—రత్నాంగుళీయమువలె నున్నది. ఎంత విలువయుండునో కదా!

కాల—లక్షరూపాయల విలువగలది..........ఏ మంతనిదానముగఁ జూచుచున్నావు! నీ యంగుష్టమున, కిది తగియుండుననియేనా?-

సులో—కాదు; కాదు—.........

కాల—కాదని పలుకనేల? నీవదనముం గాంచిన, నీకు దీనిపై భ్రాంతి యున్నట్లే తోచుచున్నది.

చ॥ హరిణములట్లు చంచలములై—తటిదద్భుతకాంతిజాల వి
స్ఫురితములై—కరంబునరమోడ్చి, హృదంతరభావ సూచకో
త్తరములునైన నీదుకనుదమ్ములు చెప్పకఁ జెప్పుచుండఁగా
నిరవుగ దాప నీకుదరమే? హృదయస్థితభావజాలముల్॥— ౬

కావున, నీవు నోటితో నడుగకపోయినను, కన్నులతో నడిగితివి గావున దీనిని గైకొనుము.

సులో—ధన్యురాలనైతిని. (గైకొని వ్రేలికిఁ బెట్టుకొనును.)

కాల—ఇంతలోననే, ధన్యురాలవైతివా?—ఎప్పటికి దైవ మేపరిస్థితుల నెట్లుమార్చునో, యెవ్వరెఱుంగుదురు?—......సులోచనా! మఱియొకమాట!—నీవు, నన్ను దర్శింప నభిలషించినపుడు, నాకది యెట్టి విచారకాలమైన సరియే—ఎట్టి యవసరకాలమైన సరియే—ఎట్టి యాగ్రహకాలమైన సరియే—నీవీ యంగుళీయ ముం బంపుదువేని, యవశ్యముగ దర్శనమిచ్చెదను.

సులో—ప్రభువువారి యనుగ్రహమునకు పారములేదు.

(చాటున నీలకంఠుఁడు ప్రవేశము.)

నీల—(స్వగతము) అవసరమగు కార్యముగల్గివచ్చితినిగాని, ఈతఁ డంగ నాలోలుఁడై యుండుటచే—అదనుగాదు. ఐనను, నన్నిచ్చట నెవ్వరుం జూడఁజాలరు. ఈసరసగోష్ఠి సందర్శించియే పోవుదును గాక!—(దాగియుండును.)

(తెరలో) ప్రభువుదర్శనముఁ గోరుభటుల విజ్ఞాపనము.

కాల—ఎవరది?—ఆగభాషీ! చూడు.

ఆగ—(నిష్క్రమించి మరలవచ్చును) ప్రభూ! మృగేశుఁడను పేరుగల సైనికునొకనిఁ బట్టుకొని, భటులు దర్శనముఁ గోరుచున్నారు.

కాల—దేవీ?—

సులో—(నిష్క్రమించును.)

కాల—రానిమ్ము.

ఆగ—భటులారా! రావచ్చును.

(బంధితుఁడగు మృగేశునితో భటులు ప్రవేశము.)

మృగే—(పెనగులాడుచు) ఏమంత బలవంతముగ నీడ్చెదవు?—ఉండు—నేనే వచ్చుచున్నాను.

భటు—ఏమిరా పెనగులాడెదవు?—

మృగే—ఛీ! పశువా!—నోరుమూయి. చెంపలు పగులఁగలవు. (కొట్టును.)

ఆగ—ఏమిరా! మహారాజునెదుట, మర్యాద నతిక్రమించెదవా?—దండింపఁబడుదువు సుమా!

మృగే—పోరాపక్షీ! ఇట్టి తరాజుల ననేకమందిని చూచితిని. ఇతఁడు దండించుట—నేను దండింపఁబడుటా?—హే—హే—హే—

కాల—అరేదురాత్మా! ఏమనుచుంటివిరా? ఒడలు తెలిసికొనియే మాటలాడుచుంటివా?

మృగే—ఒడలు తెలియనివాఁడు మాటలాడఁగలఁడా?

నీల—(తనలో) ఇన్నాళ్లకు, కాలకేతనుని తాతను జూచితిని.

కాల—భటులారా! వీని నేరమేమి?

భటు—ప్రభూ! వీఁడు క్రిందటిరాత్రి ఖజానాద్వారమును బ్రద్దలు చేసి, ధనము నపహరించుచు, కావలివారిచే పట్టుబడెను. బంధిచునప్పటికి పదిమందియెముకలు చూర్ణమైపోయినవి.

కాల—ఆఁ—ఏమిచిత్రము! అంతటి పశ్చాత్తాపశాలియా? కానీ, చూతా ము.........ఓరీ!—దొంగతనమేల చేసితివి?

మృగే—అదియేమి ప్రశ్న?—ధనము కావలసివచ్చినది. దొంగతనము చేసితిని.

కాల—ధనమేల కావలసి వచ్చినది?

మృగే—జూదమాడి యోడిపోయితిని.

కాల—జూద మాడ నేల?

మృగే—ఉంచుకున్న ముండ—నీవు నాకిచ్చు జీతపురాళ్లతోడనే, తృప్తి నొందుననుకొంటివా?

కాల—వేశ్యాలోలత—పాపము, అకృత్యముగాదా?

మృగే—ఒడలుమఱచి తప్పత్రాగిన నాకు, కృత్యమిది, అకృత్యమిది యని తెలియునా?—

కాల—ఓహో! సర్వగుణాభిరాముఁడవే?

మృగే—కాని వాఁడెవఁడు?

నీల—(స్వగతము) సెబాసురా మృగేశా!—

కాల—కానిమ్ము, నీకు వినాశకాలము వచ్చినది. రాజద్రవ్య మేలన పహరించితివి.

మృగే—రాజద్రవ్యమెక్కడిది?

కాల—ఖజానాలోనిది.

మృగే—ఖజానాలోనిది రాజద్రవ్యమా?—రాజు పుట్టినపుడు గన తల్లికడుపులోనుండి యేమైన తెప్పించుకొనివచ్చెనా?—

కాల—సరి—చోరుఁడా! నీప్రత్యుత్తరములకు తగినఫలము ననుభవింప వలెను.

మృగే—ఫలమనుభవించుట కొప్పుకొందును. కాని, “చోరుఁడా” యని పిలిచిన, నే నొప్పుకొనను.

కాల—ఏమి?

మృగే—నేను చోరుఁడనైనచో, నీవును చోరుఁడవే!—నేను చిన్నదొంగను; నీవు పెద్దదొంగవు. నే నొక్కకొంపఁగూల్చితిని. నీవు కోటికొంపలు గూల్చితివి నే నొక్కనితలఁగొట్టితిని. నీవు యుద్ధములందు, పదికోట్లతలలు గొట్టితివి. నే నొక్కవేశ్యనుంచుకొంటిని. నీవు నూటనలుగురువేశ్యల నుంచుకొంటివి నిన్ను నూఱుసారులు శిక్షించుకొని, నన్నొక్కమారు శిక్షింపుము. నీకులేనిశిక్ష నాకెక్కడిది?—

కాల—(నవ్వి) చోరుఁడా! నీవాక్ప్రవాహమున నాయాగ్రహాకీర మెగసిపోయినది. ఆగభాషీ! వీని యభిప్రాయమునుఁబట్టి చూడఁగా—చౌర్యమును ద్రోహమని యెఱింగిచేసినట్లు తోఁపదు. కావున వీనిని, ఉద్యోగమునుండిమాత్రము తొలగించితిని. ఇప్పటికి వీనికిదే శిక్ష.

ఆగ—మృగేశా! ప్రభుశాసనమును వింటివా? నడువుము.

మృగే—(కోపముతో రాజునుఁజూచి పండ్లుకొఱుకుచు నిష్క్ర॥)

నీల—(తనలో) ఎప్పటికైనను, కాలకేతనుని నాశనమునకు వీఁడే కారణముకాఁగలఁడు. వీఁ డేమార్గమునఁ బోవునో నేనును వెంటనంటి కనిపెట్టెదను—(నిష్క్రమించును)

కాల—ఆగభాషీ!—భోజనమునకు వచ్చుచున్నానని చెప్పుము. (లేచును)

(తెర)



రంగము 2—పురవీథి.

ప్రవేశము } మృగేశుఁడు (వెనుకనుండి నీలకంఠుఁడువచ్చి—మృగేశుని వీపు తట్టును.)

మృగే—ఎవఁడవు నీవు?

నీల—మృగేశా! అల్లటిచేయకు; నేను, నీలకంఠుడను.

మృగే—ఓహో! కాలకేతనుని బావమఱఁదివా? భగినీభాగ్యజీవనుఁడవా?

నీల—నీకును—కాలకేతనునకును—జరిగిన సంభాషణమును, కాలకేతనుఁడు నిన్నుద్యోగచ్యుతునిఁ జేయుటయు వింటిని.

మృగే—విన్న నేమి?

నీల—ఏమియును లేదు. కాలకేతనుఁడు నిన్ను పరాభవించెనుగాదా!

మృగే—వెఱ్ఱివాఁడా! ఇదియేనా పరాభవము!—వీనియుద్యోగము నాకొక కాలి గోటిపాటి విలువచేయదు. ఏమనుకొంటివో—కాలకేతనుఁడుగాని, గీలకేతనుఁడుగాని—నన్ను నమ్మియుండెనా, ఇట్టి నిర్భాగ్యులను వేయిమందిని పోషింపఁగలను.

నీల—సందేహమేమి? నీవట్టివాఁడవే!—కాని, నిన్నింతచేసిన కాలకేతనునిపై నీకు క్రోధము లేదా?

మృగే—ఉండదా? అది వేఱుగా చెప్పవలయునా?

నీల—మఱి—తద్విరోధమును దీర్చుకొన నేమి యాలోచించితివి?

మృగే—ఇప్పటికేమియు నాలోచింపలేదు. ఎంతకాల మాలోచింపవలయును?—తలఁచుకొన్న నేడే వానికాల మంతమగును.

నీల—అట్లుకాదు. ఉపాయాంతరమును, అందుల కనుకూల సమయమును, నీకెఱిఁగింతును. నీవెక్కడ నుందువు?—

మృగే—నాకు మూఁడుస్థలములున్నవి. అక్కడ తప్పక దొరికెదను.

నీల—ఏ స్థలములు?

మృగే—"కులనాశక" యను వెలయాలి యింటిలోఁగాని, సందువీధిలోని సారాదుకాణములోగాని, చీఁకటి సందులోని జూదపు కొంపలోఁగాని, తప్పక దొరికెదను.

నీల—సరే! నేను నీకొఱకు కబురంపినపుడు రమ్ము.

మృగే—మంచిది.

(ఇరువురును నిష్క్రమింతురు)

(తెర)

•••○○○•••

రంగము 3—కాలకేతతుని, ఉద్యానవనము.

ప్రవేశము—సుఖాసీనులై మంగళ, సులోచన, పంకజ—

సులో—చెల్లెలా! నేనబద్ధమాడుటలేదు. మందుగాని మంత్రముగాని, నే నేమియు నెఱుంగను.

మంగ—కాదుకాదు. నేను నీమాటలునమ్మను. మందుగానిచో మంత్రముగావలెను. మంత్రముగానిచో మందుకావలెను. ఈరెంటిలో దేనినో యొకదానిని,నీవు—మహారాజునకు ప్రయోగించితివి. నేను గ్రహింపఁజాల ననుకొంటివా?

సులో—(నవ్వి) ఏమిగ్రహించితివి? ఎట్లుగ్రహించితివి?

మంగ—మహారాజు నీపై నెంతప్రేమతోనుండునో ప్రత్యక్షముగఁ గనఁబడుటలేదా?

సులో—నీపై కన్న నాపై—మహారాజు చూపుచున్న యధికానురాగమేమి?

మంగ—ఒకటిరెండు తార్కాణములుగాదు చెప్పఁదలఁచిన శతాధికములు గలవు.

సులో—ఒకదినమున నీయింటను—ఒకదినమున నాయింటను నుండునట్లు నిర్ణయించుకొని మహారాజు సమానానురాగముం బ్రకటించుటలేదా?

మంగ—ఉండుటమాత్రమే సమానము. అనురాగముమాత్ర మసమానము—

సీ॥ పరివిమల సత్యానురాగంబు నీపాలు
నాపాలు కపటాభి నయపుజాలు
వెలగల బహుమానముల దొంతు నీవంతు
నావంతు వాక్యదానములరంతు
పులకించు చుంబనంబులవిందు నీయందు
నాయందు కటువర్తనములపొందు

శృంగార పర్యంకరంగంబు నీయింట
నాయింట ప్రణయభంగముల మంట
నాతి! నీవశ మతని శృంగారరసము
నానశము ప్రాణపతి భయానక రసంబు
పోలతి! మన మన కాపురంబుల విధంబు
స్వర్గ పాతాళలోక భేదంబు గాదె!

సులో—మంగిళా! మహారాజు స్వభావముం బట్టి—వారు నీవద్దమాత్రమే గంభీరులై యుందురనియు, నాపై చనువిచ్చుచున్నారనియును భ్రాంతిపడుచున్నావు. ప్రభువు నీవద్ద నెట్లుందురో—నావద్ద నయినా నట్లేయుందురు.

మంగి—నీమాటను నే నిందులకే విశ్వసింపనని చెప్పితిని.

సులో—ఎందులకు?

మంగి—ప్రభువునకు నీపై గల ప్రత్యేకానురాగమునకు తార్కాణము గాన్పించుచుండగా బొంకెదవేల?

సులో—ఆ తార్కాణ మెచ్చట నున్నది?

మంగి—నీ వ్రేలిపై—

సులో—ఓహో! రత్నాంగుళీయమా?

మంగి—కాదామఱి? లక్షరూపాయల విలువగల రత్నాంగుళీయ దానము—స్వల్పమైన యనురాగమునకే తార్కాణమా? సంస్కృతభాషాపఠన ప్రోత్సాహము సమానానురాగమునకే తార్కాణమా?—సవతినగు నావద్ద సంతతము నిన్ను స్తుతించుట సహజగాంభీర్యద్యోతకమునకే తార్కాణమా? సులోచనా! నావద్ద నేల నీరహస్యమును దాచుకొందువు? సపత్నివైన నిన్ను—నీయాధిక్యతను గణింపక తృణీకరింపవలసిన నిన్ను—అధఃపతితవైనచో నే నానందింపవలసిన నిన్ను—అభిమానమును చంపుకొని—అసూయను నణచివేసికొని స్వాహం

కారిమునకు జలాంజలియిచ్చి—పత్యనురాగాకాంక్షచేత పతి ప్రణయా వ్యామోహముచేత—పతి ప్రతిప్రేమాభిలాషచేత—దోసిలియొగ్గి—పాదములంబడి ప్రార్థించుచుంటినే! నాయందలి యభిమానముచేఁ గాకున్న మానె—నాదైన్యతం బరికించియైనను—చెప్పవా? అక్కా సులోచనా! పతివశీకరణమునకై నీవు ప్రయోగింపనేర్చిన మంత్ర తంత్రాదుల పరమ రహస్యమును నాకు జెప్పవా?

సులో—అయ్యో! ఎంతబేలవు; మంగళా! ఇది నీ వట్టిభ్రాంతియేకాని, మంత్రమునుగాని తంత్రమునుగాని నేను ప్రయోగించుటలేదని నీకేమిచెప్పిన నమ్మకము గల్గునో నాకుఁ దోఁపకున్నది.

మంగ—ఏదియోచెప్పి నాకు నమ్మకము గల్గింపవలెననియా నీయూహ? అట్లయిన తుదకు చెప్పనేచెప్పవా?

సులో—అయ్యయ్యో! ఒక్కటియే మొండిపట్టుబట్టిన నేనేమి చేయుదును? చెప్పుట కేద్దియైన నుండినఁగదా! చెల్లెలా! నే నెఱిఁగినంతవఱకు పత్యనురాగమున కొక్కటియే మార్గముగలదు.

చ॥ మనమున వాక్కునం గ్రియల మర్మమెఱుంగక నెల్లవేళలం
మన ననుకూల వర్తనలతో నిజనాథుని సేవజేయుటే
వనితకు సాధ్వియై నెగడు నైఖరి; యింతకు మిన్న మంత్రముల్
ఘనతర తంత్రమార్గములు గల్గవుసుమ్ము కురంగలోచనా॥

మంగ—ఇవి కవులు గ్రంథములలో వ్రాయు నీతులుగాని కాంతల యాచరణమునకు వచ్చునవిగావు. ఐనను నేనుమాత్రము ప్రభు సేవయందెట్టి లోపముచేయుచున్నాను?

సులో—అదియేమో నేనెట్లుచెప్పఁగలను? కాని నీవు నేడు నన్ను ప్రశ్నించిన నైఖరి నాలోచింపఁగా నాకు మహాభారత గాధయొకటి జ్ఞప్తికి వచ్చుచున్నది.

మంగ—అదియేమి?

సులో—పూర్వము సత్యభామ ద్రౌపదింజూచి "వదినా! నేను ఒక్క భర్తనే రంజింపఁజాలక దుఃఖపడుచుండఁగా, నీవు ఐదుగురుభర్తల యనురాగమును సమానముగా నెట్లు జూరగొనుచున్నావో నాకాశ్చర్యకరముగానున్నది. నీవు నీభర్తలకు బ్రయోగించిన మంత్రౌషధాదులను నాకెఱిఁగింపవా?" యని ప్రశ్నించెనఁట!— అందుల కామె, నేనిప్పుడు నీకుచెప్పినట్లే—కులకాంతకు సాధ్వీత్వమే మంత్రము, సౌశీల్యమే ఔషధ" మని చెప్పినదఁట! మన కథ యట్లున్నది.

మంగ—(కోపమును దిగమ్రింగి) మంచియుపమానము చెప్పితివి. చెప్పినఁజెప్పితివిగాని—నన్ను చెప్పుతోఁగొట్టినట్లు మాటాడితివి. ఏమైననేమిలే! నీయుపమానముమాత్ర మెంతోయందముగ నున్నది. నీవనినట్లు చిరకాలము నీవైదుగురు మగల ద్రౌపదివిగను, నేనొక్క మగఁడేకల సత్యగనే యుండవలెను.

సులో—చెల్లెలా! ఉపమానముగ జెప్పినకథ గదాయిది! కోపము వచ్చినదాయేమి?—

మంగ—కొఱవితో తలగోకిన కోపమువచ్చునా?

—(అగభాషిప్రవేశము)—

అగ—రాణులారా! ఏమివాదమునకు లోనైతిరి?

మంగ—వాదమునకేమున్నది. ఏకాష్ఠమున కగ్ని ముట్టుకొనెనో యది రవులొ్కనుచున్నది.

మంగ—అదిరవులొ్కనుటతోఁదీరదు. చల్లారకముందు, సమీపకాష్ఠముల కంటుకొని దావానలం బ్రజ్వలింపఁజేయును.

అగ—కాష్ఠమేమో—అగ్నియేమో—దాని నట్లుంచుఁడు. సులోచనాదేవీ! ప్రభువు సెలవైనది.

సులో—వచ్చుచున్నాను.

(ఆగభాషివెంట సులోచన నిష్క్రమించును.)

మంగ—పంకజా! చూచితివా—ప్రభువు సులోచనకొఱకు కంబరంపి నాఁడు. మంగళయను బానిసయొకతె కలదనుమాటనే మఱచి నాఁడు. ఈపక్షపాతమే యీసులోచనా పిశాచమున కంతటి గర్వముం గల్గించినది. ఓసీ కుటిలాత్మురాలా! నీమంత్రౌషధములు నీకడనే యుండిపోయినఁ బోవుగాక! సత్యాద్రౌపదీ సంవాద కథనుజెప్పి నన్ను అన్యాపదేశముగ నిందింపవలసిన ప్రసక్తి నీ కేలగలిగినది? నేను ప్రభుమానసమును రంజింపఁజేయజాలని యసమర్థురాలననియును—నీవు మహాసాధ్వివనియు, నన్నెత్తిపొడుచుచుంటివిగాదా! ఎంతికౌటిల్యము? ఎంతయహంభావము? ఎంత మదోన్మత్తత! ఎంతగర్వభావము! నాకింతటి పరాభవము గల్గినపుడు నే నోర్వఁగలనా? తేనెపూసిన కత్తివలె పైకి సాధురూపమునఁ గాన్పింప నీకుటిలబుద్ధి నెఱుంగక భ్రమపడి వెకలినై నిన్నర్థింప వెలితిపడిన నామూర్ఖ్యతకు మేరగలదా? ప్రభువు—నీకమూల్యమగు నంగుళీయమునిచ్చి నెత్తిపై కెక్కించుకొని యెను. నీమిడిసిపాటున కిదియేకారణము! నీకు రాజుకడనున్న చనువిఁక నెంతోకాలము సాగదులే! నీవ్యూహములకు బ్రతివ్యూహములుపన్ని నిన్ను నాశనముచేయకున్న నేను మంగళనుగానని యెఱుంగుము.

పంక—అమ్మా! భగవత్పూజాసమయమైనది. నేడు శుక్రవారముగదా!

మంగ—పంకజా! నాకీదినమున శిరోబాధగానున్నదని అర్చకునితో మనవిచేయుము. నేను నేడు ఆలయమునకురాను.

పంక—దేవీ! ఇంతలో నిట్లు మనోవైకల్యము నందదగునా?

మంగ—ఓసీ! బానిసా! ఇది నీకొకస్వల్పవిషయముగఁ దోఁచుచున్నదా? ఇది నాకు శిరచ్ఛేదముకాదా? లజ్జాభిమానములు నీతోపాటు

నాకును లేవనుకొంటివా? అది యట్లు తెగబడి దూషింపఁగా— నోరుమూసికొమ్మనుచుంటివా? దాని పాదములకు పరిచర్య చేయుమనుచుంటివా?

పంక—అమ్మా! అట్లయిన నీయాగ్రహమునకు నేమిపని? కార్యమును బరికింపుము.

మంగ—పంకజా! అన్నట్లు నాకిప్పు డింకొకవిషయము స్ఫురించు చున్నది—నేనిప్పుడు వెళ్లినె తనతోఁజేసిన ప్రసంగమును సుగుణ చన ప్రభువుతోఁ జెప్పకుండునందువా?

పంక—ఇప్పుడు దానికి ప్రభువుపై గల చనువుంబట్టిచూడఁ జెప్పునని యే యూహింపవచ్చును.

మంగ—చెప్పినచో—ప్రభువునకు నాపై నాగ్రహము కలుగదా?

పంక—కలుగనిచో నీవనతి కలిగింపఁగలదు.

మంగ—ఇందులకు ప్రతిహతముగా దాని వినాశమున కొకపెద్దవ్యూహము బన్నితీరవలెనుగాదా!

పంక—పన్నకుండిన ప్రమాదముగాదా!

మంగ—నాసోదరుఁ డెందున్నాఁడు?

పంక—తన మందిరమునవే—

మంగ—మంచిది. పోవుదము పద— (అబంధము 3)

(ఇరువురును నిష్క్రమింతురు)

(తెర)



4 వ రంగము—నీలకంఠుని ప్రత్యేకమందిరము.

ప్రవేశము—ఆసీనుఁడై సురాపానముఁజేయు నీలకంఠుఁడు.

నీల—(స్వగతము) ఈ కాలకేతనుఁడు రాజ్యచ్యుతుఁడైనచో, ఈ రాజ్యమును పరిపాలించుట కీనీలకంఠునికన్న నధికసమర్థుఁ

డెవఁడు? నాసహాయమునఁగదా—కాలకేతనుఁడు రాజ్యపాలనము చేయుచున్నాఁడు! నేను లేనినాడు, వీనిపని సున్నయే కదా!......... ..కాలకేతనుఁడు ప్రజాదరణముఁ బాయుచున్నాఁడు. వీని వినాశమార్గము నరయ నాకీదిగదా తగిన యదను! "నీలకంఠమహారా"జను నామమును, శ్రవణపర్వముగా, నేనెన్నడు విందునోకదా! కాలకేతనుఁడు క్రూరబుద్ధియై, చాళుక్యులఁ బరాజితులంజేసినాఁడు. రూపలిని మహాఘోరముగ, శిలువపై నురిదీసినాఁడు. మృగేశుని, పరాభూతునిఁ జేసినాఁడు. వాని కిప్పుడు, అనుకూలదినములుగా నున్నందున, నేమియుం జేయలేక—అందఱును మిన్నకున్నారు—కానిచో, ఒక్కని నాశనమున కిందఱు కానలయునా?—ఏదేని మార్గము నాలోచించినఁగాని—కార్యము లేదు.(సురఁద్రావి) ఏమిచేయుట కునుఁ దోఁపదు. వీనిపేరు వినినంతనే, సేనానివహము, సుడిగాలికిఁ గంపించు శాలిక్షేత్రమునలె, ప్రకంపమానమగుచుండెను. నీనిమొదుట నోరెత్తిమాటాడి నిలువఁగల్గిన వాఁడొక్కఁడును లేఁడయ్యెను ఏదిమార్గము? (మఱల సురఁద్రావి) మఱచితిని. కలఁడుగదా మృగేశుఁడు! వాఁడొక్కఁడే వీనికి గర్భశూలము! మృగేశుఁడే, వీనిపాలిటి మృత్యుదేవత!—కాని, వాఁడొక నీచాతినీచుఁడగు విచిత్రవ్యక్తి!—సురాపానము, ద్యూతము, వేశ్యాలోలత, తప్ప—వానికింకొక లోకమే లేదు. వాఁడేమి వీని నాశనమునకుఁ బనికివచ్చును? కాదు—కాదు—పొరఁబడితిని. వాఁడే వీనికి దగినవాఁడు. కంటకోన్మూలనమునకు కంటకమేకదా సాధనము. కార్యసాధనానంతరమున, రెండు కంటకములును విసర్జనీయములే!—అట్లే—కాలకేతన కంటకమును, మృగేశకంటకముచేఁ బెకలించి— నశింపఁజేసి —అనంతరము నీనినాశమును సయితము గాంచవలయు. అప్పుడుగదా—నా మార్గము నిష్కంటకమగుట!—(నిషాచే తూలుచు) హాయి!

హా యి! నా కెట్టి బుద్ధివికాసముగలిగినది. ఎంత మంచియాలోచ
నము తోఁచినది! ఈరాజ్యమునకు రాఁబోవు రాజగు నీలకంఠ
మహారాజుగారి యానందముకొఱకు—ఇదిగో సురాపానము!
ఒకటి—రెండు—మూఁడు—

(మూఁడుసారులు త్రాగుచుండును; మంగళ వెనుకనుండివచ్చి
ఆచర్యలను పరికించుచుండును.)

మంగ—అన్నా! నీలకంఠా!

నీల—(తలవంచుకొనియే నిషాచే) మృగేశా! వచ్చితివా! ఇటురా!—
నేను నీకు, అన్న నెప్పుడై తినిరా?—

మంగ—నీస్థితి యింత మితిమీఱిపోయినదా?

నీల—(సురారసమును పాత్రమునఁబోసి) నీకన్న నెంతో మితిమీఱితి
నని తలంచుచుంటివా? వెఱ్ఱివాఁడా!—తొందఱ యేమియును
లేదు—చూడు—పాత్రమున కొంచెము మిగిలిపోయినది. నీవు
త్రాగిచూఁడు—

(తలవఁచుకొనియే అందించును.)

మంగ—(పాత్రము నావలబారవై చి కాలఁదన్ని) ఏమి నీమధుపానవికా
రము!—కన్నులుమూసికొని సురాపాత్రమును ముందుంచుకొని
యంధుఁడవై యధఃపతితుఁడవగుటయే నీకానందమనుకొంటివా?
నీవారికి జరుగుచున్న యవమానుషమును—అగౌరవమును—
సుంతైన గుఱ్తింపలేకుంటివా? మూఢమతీ! అంతఃపురమున నీసో
దరి కన్నుల నీరుగార్చుచుండఁగా—నీవిచట నానందమున, సురా
రసమును పీల్చుచుంటివా? నాకన్నులు దుఃఖముచే నెఱ్ఱవడు
చుండఁగా—నీకన్నులు మధుసేవచే నెఱ్ఱవడుచున్నవా? ఈమతి
మాలిన వేషము లెందులకు పనికివచ్చును?—నీకును నాకును

గుడ్డిగవ్వంత విలువగలదా?—రాజశ్యాలకుఁడవని నీకును రాజదేవేరినని నాకును పెద్దపెద్ద బిరుదములేల కాల్పనా?—

నీల—(స్వగతము) ఎంతపొరబడి మూర్ఖుఁడనైతిని. (ప్రకాశముగ) సోదరీ! కూర్చుండుము. ఏమి యిట్లు తీవ్రముగ వచ్చితివి?—

మంగ—తీవ్రముగాక శాంతమెక్కడిది?—అధికార గర్వోన్మత్తుల యాగ్రహమున కడలి, హృదయమున తీవ్రపడుటయే కాని—చేయఁగల్గినదేమియును లేదుగదా? నీయట్టిసోదరుఁడు లభించిన తరువాత నాకేమి లోపమున్నది? నీతోపాటుగా నేను నింత సురాపానముచేసి, పరిహసించువారి నగుబాట్లకును, దూషించువారి నిందాభాషణములకును—హింసించువారి దౌష్ట్యమునకును, లోనగుచు ఎడమకాల కుడికాల లోకులుతన్నుచుండఁగా—ప్రాణములచే కుళ్లి గుమ్మములనుండి కదలలేక, ఈడ్గిలఁబడి మొత్తోయని మొఱుగుశ్వానములకన్న హీనములగు బ్రదుకులతో, మనము కాలము వెడలఁదీయవలసినదే కాని, అంతకన్న నధికముగలదా?

నీల—మంగళా! నిన్నెవరు పరాభవించినారు? స్థిమితముగఁ గూర్చుండి మాటలాడుము.

మంగ—మన యధికారము మంటఁ గలియుచున్నపుడు మనము పాతాళమున కణఁగిపోవుచున్నపుడు స్థిమితముగఁ గూర్చుండి నీవు తప్పత్రాగఁగలవుగాని—నాచేతగాదు; నాచేతగాదు. మానాభిమానవర్జనము నీవు చేయఁగలవుగాని నావలన నగునా?

నీల—ఎందుల కీయాగ్రహము? చెప్పఁదలఁచినది చెప్పకున్న నాకెట్లు తెలియును?

మంగ—నీకేమియుఁ దెలియదని నేనెఱుంగుదును. ఏమైనఁ దెలిసియే యున్నచో—నాకీయమానుష మింతవఱకు జరుగదు. నీకు సామర్థ్య మేమైనున్నచో—నేనింతగా నలువురికన్నులకును అపమర్థురాలివలె కన్పడియుండను. నీవు గాజులనుతొడిగించుకొనిన

యాడుముండవు గాని చో — నే నందఱకన్నులకును పెద్దపులినై భ్రూభంగమాత్రమున ప్రపంచకమును గడగడలాడించి శాసించి యుండకుందునా? — జ్ఞానహీనుఁడా! నాకీపరాభవములు చేయించుటకా వెదకి వెదకి, ఈకాలకేతనరాక్షసున కిచ్చి — పెండ్లిచేసితివి!

నీల — చాలును; మంగళా! ఎందుల కీనిష్ఠురముల నాడెదవు? ఎచ్చటనో నీవందివచ్చిన పరాభవమును నేను స్వప్నమునఁ గాంచకుండుట నాదోష మనుచుంటివా? — నీకు కష్టములు గలుగవలయునని నీకీపెండ్లిచేసితినా? ఎందులకువచ్చిన సంభాషణము! — విషయమును నాకెఱిఁగింపుము. ప్రతిక్రియ చేయకున్న దూషింపుము. పరాభవింపుము. కాదనను. నావద్ద దోషము లేదనను —

మంగ — మంచిది. నేనొక ప్రశ్న వేసెదను చెప్పెదవా?

నీల — ఒకటికాదు; నూఱుప్రశ్నలు వేయుము — చెప్పెదను.

మంగ — నావివాహమునాటికి కాలకేతనున కింకొకభార్యయుండెనా?

నీల — లేదు. మొదటిభార్యను త్యజించెనుగదా!

మంగ — నేను పట్టపుదేవి నగుదుననికదా నీవు చెప్పితివి.

నీల — అం దసత్యమేమున్నది?

మంగ — కాలకేతనుఁడు చాళుక్యవిజయ మొనరించినతరువాత సులోచన నీతఁడు పెండ్లియాడునపుడు నాసర్వాధికారములును నాకుండునట్లేకదా ఏర్పాటులు జరిగినవి! —

నీల — ఔను.

మంగ — ఇప్పుడు రాజెవ్వరియందు విశేషానురాగముతో వర్తించున్నాఁడో సూచనగనైన నీకు తెలియునా?

నీల — ఇంకెవ్వరియందు? — నీయందేయని తోఁచుచున్నది.

మంగ — నాయందా? నాయందా? నాయందే రాజున కనురాగముండి యున్న నాకీ కడుపుమంట యెందులకు? - నాకీదుఃఖ మెందులకు? - నిన్ను ప్రార్థించుటయేల? — నీప్రసక్తికి నేనురానేల? ఈరాద్ధాంత

సిద్ధాంతములు చేయనేల?—ఇప్పుడు నేను నిన్ను నిరాఘాటముగ గ్రుడ్డివాడవనిన తప్పేమున్నది?-మందమతివన్న దోషమేమున్నది? స్వమాన సంరక్షణముసం దుపేక్షగల పిఱికిపందవనిన నపరాధ మేమున్నది? ఛీ! ఎంతసాహసముతోఁ బ్రత్యుత్తర మిచ్చితివి?

నీల—మంగళా! నేనెఱుంగని విషయములను, సిద్ధాంతమునకుఁదెచ్చి—దూషించి—నామనస్సును, నీనిందాప్రవచనములచే— కలఁత వరచిన నేమిలాభము? రాజు నిన్ను తృణీకరించి—నీసవతుల నెవ్వరినైన, శిరోభూషణము గావించుకొనినాఁడా?—నీయధికారముల నూడఁదీసి—నీప్రతిస్పర్థుల కిచ్చినాఁడా? సులోచనచేఁ గాని, మఱియొక దానిచేఁగాని, నిన్నుదూషింపఁజేసెనా? ఏమి జరిగినది?—నాకెఱిఁగింపుము.

మంగ—ఏమిజరిగిననేమి? నీకావివరములన్నియు నేనిప్పుడెఱిఁగింపలేను. నాయొడలు మండుచున్నది. నీవు సులోచనా వినాశనమున కేది యేని తంత్రముఁ బన్నెదవా లేదా?—

నీల—నీవంత పట్టుదలతో నున్నపుడు—ఏమైనఁ జేసితీరవలసినదే!— కాని, నీవొక్క సంగతి మాత్రము చెప్పుము.

మంగ—ఏమది?

నీల—సులోచనయం దేద్దియేని నేరముచూపించి రాజునెదుట పరాభవ ముపాలు చేయించుటయే కదా నేను చేయవలసినది!

మంగ—ఔను.

నీల—అందులకు మూఁడునిమిషములు పట్టదు. ఈలోపల నీవుకూడ రాజుహృదయమునందు — అనుమానభూతమును ఆవేశింపఁజేయుము. నాపనిని నేను చేసికొందును.

మంగ—నీవెట్టితంత్రము నూహించితివో నే నెఱుంగవచ్చునా?

నీల—నే నింక నేమియు నాలోచింపలేదు. ఆలోచించి నీకెఱిఁగింతును. నీవింక బొమ్ము.

మంగ—అధికారగర్వము హతమంది-స్వాభిమానముసమసి ప్రతాపము భస్మీపటలమై సులోచన కాలకేతన క్రోధార్ణవమున, శలభ ప్రాయమై—కాలి, కూలి, నశింపవలయు. నీబుద్ధిబల మిప్పుడు తెలియవలయును—జాగ్రత్త—జాగ్రత్త—ఏమాత్ర మశ్రద్ధయై ఏమాత్ర మనన్వయమైనను కాలకేతనుఁడు మనల నిరువురను యజ్ఞపశువులనట్లు గొంతుకలు పటపటఁ గోయఁగలఁడు. నే నరుగుచున్నాను. హెచ్చరిక! (నిష్క్రమించును)

నీల—(కొంచెము సురఁద్రావి)ఆలోచనమున కిది సమయము. వ్యూహ నిర్మాణమున కిది తరుణము—మాయాప్రయోగమున కిది వేళ—మారణ మంత్రోచ్చాటన కిది కాలము. కాలకేతనునిపై నిఁక కాలాంజనముం బ్రయోగించెదఁగాక! సులోచనా వినాశమును, మంగళా మంగళమును—(ఆలోచించి) కటకటా! "మంగళా౽ మంగళ" మను తలంపునందే అమంగళార్థ స్ఫురణమగుచున్నది గదా! నాప్రయత్నము ముందెట్టి పరిణామదశం గాంచనున్నది యోకదా! మంగళాభ్యుదయమును-అచిరకాలమున నీలకంఠుఁడు గాంచఁగలఁడు. ఇదియే నీలకంఠసామ్రాజ్యోదయ మూలహే తూత్పత్తి—

సీ॥ హంతక కార్యమా? అవిచార్యమా యిద్ది?
కాదు మంత్రాంగవికాసఫలము
అనుజీవనున కర్హమా యిట్లుసేయుట?
చేసినవారికే చేవతగ్గ?
నాశనతంత్ర మన్యాయమా? శ్రేయమా?
అటుగాక భూపతినగుటయెట్లు
అపకీర్తిగల్గు నాయవనీపతులలోన
నెటుబహిరంగమా నీకృతంబు?

సంశయంబులికేల? ప్రశస్తరాజ్య
తంత్ర నిర్వహణానూన దారుణప్ర
కార, మాయావిధప్రయోగంబుచేత
కాలకేతనుఁజంపి—భూకాంతుఁడౌదు॥

(నిష్క్రమించును.)

(తెర)

••••○○○••••

5 రంగము—మంగళాంతఃపురము.

ప్రవేశము—మంగళ కాలకేతనుఁడు.

కాల—మంగళా! ఏమట్లున్నావు?

మంగ—(మాట్లాడకుండును.)

కాల—(అసంప్రీతిగర్భితముగ శిరఃప్రకంపనముఁజేసి) ఆఁడుజాతి యిట్టి దని నేనెఱుంగుదును. నీమృషానటనములతోడ నామనస్సును చెదఱఁగొట్టనక్కఱలేదు. ఏమి విచారకారణము?

మంగ—ప్రభువు వారాగ్రహించిన కొలఁదియు నావిచారము, మితి మీఱునేకాని తగ్గదు.

కాల—(నవ్వి) కాదు; కాదు—మంగళా!—బంగారమైనను, అగ్నిలో కాచినపిమ్మట—సమ్మెట దెబ్బలు కొట్టినఁగాని, శిరోధారణార్హ ముకాదు. ఆపాటి యాగ్రహమును, నేను అభినయింపకున్న— నీవు మాటలాడియుందువా?

మంగ—మీదాసి, యంతసాహసురాలుగాదు ప్రభూ!—

కాల—సరి; ఇకచాలును. ఇటురమ్ము—నాసమీపమునఁ గూర్చుం డుము.

మంగ—(కూర్చుండి సురారసము నీయఁబోవును.)

కాల—ఇప్పు డీపానగోష్ఠి యెందులకు?—ప్రేమగోష్ఠిచాలదా?

మంగ—ప్రభువుచిత్తము. (తీసివేయఁబోవును.)

కాల—అంతలోననే తీసివేయకు—ఉండనిమ్ము. ఉండనిమ్ము—

మంగ—ప్రభువు చిత్తము—(తిరిగియుంచును)

కాల—(సురద్రావి) మంగిభా! నీవంత సాహసురాలవుకానంటివి; ఔనే! కాని అంత సాహసులెవ్వరో చెప్పఁగలవా?—

మంగ—ఎవ్వరైన నాకేందులకు? వారే తమనెత్తిమీఁది దేవతలుగదా!

కాల—ఎవరా నెత్తిమీఁది దేవతలు?

మంగ—మీరు, నమ్మినవారు—

కాల—ఎవరిని నమ్మితిని? ఇటుచూఁడుము, మొగము చాటువేయకుము. సరిగా మాటలాడుము. కాలకేతునునిలో చుట్టుమాటలు పనికి రావు. ఎవరిని నమ్మితిని?—ఎవరిని నానెత్తిమీఁది దేవతలనుగా నీవు వర్ణించుచుంటివి. వారి నామములు, వారి స్థానములు నాకు తెలియవలెను. చెప్పుము.

మంగ—అట్లు తము రాగ్రహించిన నేను మాటలాడఁగలనా?

కాల—ఆగ్రహముగాదు.

గీ॥ అఖిలజనులను శాసించునట్టినేను
తలనొకరిఁదాల్చితినటంచుఁ దలఁచి తీవు
వారలెవ్వరు? నీకెట్లు వాస్తవంబు
దెలిసె? నెఱిఁగింపుమింక నీతెగువమూల॥ ౧౦

మంగ—ద్రావిడులను—ద్రావిడదేశమును—ద్రావిడజాతిని, నిందచేసి ఆంధ్రజాతి యాఁడుదాని మొగమిచ్చకములను సహింపలేక తమతో నే నిట్లనుచుంటిని.

కాల—ఎవరా యాఁడుది? సులోచనయా?

మంగ—ఔను—మహాప్రభూ!—

కాల—సులోచన యేమనియెను?

మంగ—వివరములను తెలుపలేను. మనజాతిని మాత్రము నిన్నసాయం
కాలమే దూషించి పరిహసించెను.

కాల—(నవ్వి) ఇందులకేనా—ఇంతయార్భాటముచేసి నేనువచ్చి సమీ
పమునఁ గూర్చుండుటయైన నెఱుఁగక మైమఱచి మొగముమా
డ్చితివి. ఒకజాతి పరజాతిని దూషించుట నేఁడు క్రొత్తగాఁబుట్టి
నదియా? నీవెన్నిసారులు—ఆంధ్రజాతిని దూషింపలేదు!—
నీవుచేసిన దూషణము నాయిచ్ఛకములకొఱకును, అది చేసిన
దూషణము నాపైవిరోధముకొఱకు నగునా?—అందులకై —
నేను దానిని నెత్తిపైనెక్కించుకొంటినని మఱిలి మాటలాడుచుం
టివా?—మంగళా! జాగ్రత్త! ఒడలుతెలిసికొని మాటలాడుము.
ఎవరితో సంభాషించుచుంటివో యెఱిఁగి నోరువిప్పుము. సులో
చన నాయందెన్నఁడైన నవిధేయురాలయ్యెనా?—లేదుగదా—
ఎందులకీ కడుపుమండినమాట? సవతి మాత్సర్యమా?—

మంగ—(ఈర్ష్యాదుఃఖములతో) ప్రభువువారియం దవిధేయులై—అమా
నుషకార్యములచే ప్రొద్దుగడుపుచు—అపకీర్తి కారకులయినవారి
లోపము లన్నిఁటిని దాచిదాచి యీపాటిలోపమును బయల్పర
చుటయే తమయందు నేను చేసిన మహాపరాధమైనచో—ప్రభూ!
నేనానందముతో మీరనుమాటలన్నిటి ననుభవింతును. అనుభ
వించితీరెదను. కాని యింతటి మహారాజును మభ్యపరచి తాను
నిష్కళంకవలె నటించుచు జారిణీద్రోహ మహాపాతకమునుండి
వెలివడి ఎఱిఁగి ఎఱిఁగి యేదైన నోరువిప్పి వచింపఁబోయిన
ననుబోటి యమాయికలయందు సవతిమాత్సర్యమును భ్రమిం
పఁజేసిన యా సులోచన యభ్యుదయమునకు కడుపు సలసల
క్రాగుచున్నది. కాని చేయునది యేమున్నది? ఇంకొకసారి నోరు
విప్పను—విప్పను—ఎవ్వరేగతియైనను నాకువలదు. పరమేశ్వర

సాక్షిగా నేను పతిపాదములనే నమ్మితిని. నాకది చాలును.
(పోఁబోవును)

కాల——ఎక్కడికిఁ బోవుచున్నావు?

మంగ——మందిరాంతమునకు.

కాల——నే నిక్కడనుండఁగనే నీ కంతసాహసమా?——

మంగ——ఏమిచేయుదును ప్రభూ! క్షమింపవలెను. రక్షింపవలెను. నాకీదినమున మతిభ్రమణము కలిగినది. ఔరా! కాలసర్పమును పూవులదండయను ప్రభువు విశ్వాసము!——కాలవికృతి! కాలవికృతి!!—

కాల——నిలువుము——నీ సమస్యలను నేనిక వినువాఁడనుగాను. సులోచనను జారిణియంటివి. జాగ్రత్త! జాగ్రత్త!! మంగళా!——ఋజువు చేయవేని, కంఠము త్తరించుకొనిపోవును సుమా!——

మంగ——ప్రభూ! ఆమాట నే ననను. నన్ను విశ్రమింపనిండు.

కాల——అనృతాలాపినీ! ఇటురమ్ము. నాకులేని విశ్రాంతి నీకేల?

(అనుబంధము. 4.)

మంగ——ప్రభూ! నే ననృతాలాపినిని గాను.

కాల——అట్లయిన సులోచనపైఁ గొండెముల నేల చెప్పుటకు సాహసించితివి?

మంగ——ప్రభూ! నేనుచెప్పినవి గొండెములు కావు.

కాల——సత్యములేనా?

మంగ——ఔను; ప్రభూ!

కాల——సులోచన జారిణియా?

మంగ——తమ రాగ్రహింపకున్నచో...........

కాల——నీపురాణము లింక నేమియు నాకడ విప్పవలదు; జారిణియా కాదా చెప్పుము.

మంగ——అట్లు నే నూహించితిని.

కాల—ఊహామాత్రముననే, నా చెవి నంతసాహసవాక్యము నూదితివా? నీమరణమును నీవు గుర్తెఱుఁగవా? కాలకేతనుఁడు సుమా వీఁడు! మంగళా! జాగ్రత్త!—

మంగ—ఊహయే కాదు; ప్రభూ!—

కాల—కారణముగూడ గలదా?

మంగ—కలదు.

కాల—ఏమది?

మంగ—తమ రొకదినమున నాయింటను—ఒకదిన మామెయింటను—శయనించు వాడుకగదా! తమరు నాయింటికివచ్చు రాత్రులందామె తనయింట నుండుటలేదు. నాయనుమానమున కిదియే కారణము.

కాల—ఎక్కడికేగుచున్నది?

మంగ—ప్రభూ! అది నే నెఱుంగనుకాని మేలిముసుఁగువైచికొని గృహమువిడిచి ఎందో చనుచుండును. అదియెఱుంగుదును.

కాల—(సాక్షేపణముగ) మేలిముసుఁగువైచుకొని.......గృహము విడిచి......ఎందో చనునా?......నీవెట్లెఱుఁగుదువు? నీవును దానివెంట దిరుగుచుందువా?—

మంగ—నేను తమసన్నిధినేకదా యుందును!

కాల—అట్లైన నీకెట్లు తెలియును?

మంగ—నా చెలులు చెప్పిరి. వారిని పిలిచి సాక్ష్యమిప్పింతును.

కాల—అక్కఱలేదు. నేనే స్వయముగఁ జూచెదను. నీవు చెప్పినట్లు బయటి కరుగక సులోచన ఇంటనున్నచో నీ కేమిశిక్ష?—

మంగ—ప్రభువుచిత్తము.

కాల—(తుపాకిఁజూపి) చూచితివా? నీమరణమేశిక్ష—జాగ్రత్త(నిష్క్ర)

మంగ—పంకజా! పంకజా!—

పంక—(ప్రవేశించి) ఏమమ్మా!

మంగ—ఆగ్రహముతో ప్రభువు సులోచనామందిరమున కరుగుచున్నారు. సులోచన ఈరాత్రి ఇంటనున్నచో నాకు చావు తప్పదు. ఏది యుపాయము?

పంక—అమ్మా! భీతిల్లకు. మీ సంభాషణమును చాటునుండి వినియే, నే నాతురమున నరిగి, చూచివచ్చితిని. సులోచన ఈరాత్రి కపాలేశ్వరాలయమునందలి విద్వాంసురాండ్రనద్ద సంస్కృతము నభ్యసింపఁ బోయినది.

మంగ—నిజమేకద! పంకజా! నాకు ప్రాణభీతిలేదుగద!—

పంక—లేదు; రమ్మ—నీయన్న నీలకంఠుఁడు పిలుచుచున్నాఁడు. అవసరకార్యము గలదు.

(ఇద్దఱు నిష్క్రమింతురు—తెర—)



## 6 వ రంగము—వీధి.

ప్రవేశము—మృగేశుఁడు—నీలకంఠుఁడు.

మృగే—నీవుచెప్పవలసినది—నేను వినవలసినది ఇంతేనా? ఇంకేమైన నున్నదా?

నీల—నిన్ను నే నిందులకే పిలిచితి ననుకొంటివా యేమి?

మృగే—కాకున్న ఎంతవిలువగల కాలమును గంగలో గలిపితివో ఎఱుఁగుదువా? ఇందులకు తగినకారణము చెప్పవేని నే నూరకుండను. జాగ్రత్త!—

సీ॥ రంగైనపాత్రితో నంగడివాఁడొకఁ
డెడ సురారసము నందించుచుండ
వింతగా బేస్తుపై బేస్తుగెల్వఁగ చీట్ల
లోన విజయలక్ష్మి బూనియుండ

సేరఁదీసినసుండ చీకలుగాల్చి ము
ద్దిడి యొక్కొకటి నోట నిడుచునుండ
ఓడిపోయినవార లుడుకుచుండుటఁగని
ముసిముసినగవుల ముఱియుచుండ

ఈ యిలను స్వర్గపురమె సారాయికొంప
గాఁగ నానందరసమహాసాగరమునఁ
దేలియాడెడు నన్నిటు దెచ్చినావు
కారణము చిన్నదైన నే నూరుకొనను॥ ౧౧

నీల—మృగేశా! నిన్నటిస్థలమునుండి కొలదికారణముండిన గొనివత్తునా?
మృగే—కారణము గొప్పదేకద! సరే! అయిన రెండునిమిషములలో చెప్పుము—వినిపోయెదను.
నీల—అంత తొందఱపడఁగూడదు. కూర్చుండి మాటలాడుకొందము.
మృగే—అబ్బా! ఇది కూర్చుండఁదగిన సమయముకాదే!—ఈనాడు ఆట కుఁగూర్చుండినది మొదలు—గెలుపంతయును మనదే! సగము లోవదలివేసినయెడల నష్టమురాదా? అదిగాక ఉంచుకొన్నదాని తో—ఉన్న పాటున వత్తునని చెప్పితిని. ఆలస్యమైనచో దాని కను మానము!—ఇంతేకాక కడుపులోనికి సారాదిగి గంటకావచ్చినది. వెధవనాలుక మటల వెనుకకీడ్చుచున్నది. కొంచెము పడవలెను.
నీల—పై రెండు కోరికలును నావలనకాదుగాని మూఁడవదానినిమాత్ర ము ముట్టజెప్పఁగలను.
మృగే—అట్లయిన కొంచెము స్థిమితపడితిని. నీవు పిలచినపని చెప్పవు గదా!
నీల—రమ్ము—ఇదియు క్షమైన చోటుగాదు. ఇంటికిఁ బోవుదము.
మృగే—రమ్ముకూడ నందేయుండునుకాబోలును—రమ్ము.

(ఇరువురు—నిష్క్రమింతురు.)

(తెర)



7వ రంగము—సులోచనాంతఃపురము.

ప్రవేశము—కాలకేతనుఁడు.

కాల—(పరికించి శిరము పంకించి)

సీ॥ తిరుగలేదింక దిక్కరియూధ మడలంది
పరచి రసాతలాంతరము నంట
వీవలేదింకను విలయ మారుతములు
లోకసంతతులఁ జీకాకుపరుప
దహనమందుటలేదు దావానలశతంబు
నిఖిలాండకోటి మండించుకొఱకు
ఉదయింపలేదు ప్రద్యోతనద్వాదశం
బసమాన విలయ దాహంబుసేయ

కలఁగి ఘూర్ణిల్లలేదు సాగరములేదు
మాయురే! ఇదియేమి విస్మయమునేడు;
చండతమ కాలకేతన శాసనంబు
మీఱిన యవజ్ఞత నతిక్రమింపఁబడునె? ౧౨

మంగళ వచించిన మాటలకును నేను చూచుచున్న దృశ్యమున కును సరిపోయినది. నేనులేనిరాత్రి—కాలాంధకారమునంబడి యీపిశా చిని స్థలాంతరముం జేరునే? ఈనాఁటి కొక యాఁడుది కాలకేతుని కన్ను లఁగప్పఁ దలఁచినదియా? ఎంత గుండెనిబ్బరము! ఆఁడుది నడురేయి గృహాంతరమువీడి—స్థలాంతరమున కేగినంత దాని నుప్పుపాఁతరవేయింప నలయుఁగాని యుపేక్షింపనగునా? కాలకేతునునిరాకకు స్వాగతమైన జరు గక మందిరమింత నిర్మానుష్యమై యుండదగునే?

ఉ॥ ఎంత యమానుషంబు? కననెంతటి దుర్వినయం బలక్ష్యమో
ఎంతటి గుండెనిబ్బర? మదెంతటి గౌరవహీనకార్యమో

ఎంత దురాకృతంబు? మదినెంత యభీతి? దురాశయం బొకో
కాంత గృహంబువీడుటనుగానక—మూసితికన్ను పందనై ॥ ౧౩

ఆగభాషి యేమిచేయుచుండెను? వానికినయితము జీవనాపేక్ష సన్నగిల్లెనుకాబోలును!—ఆగభాషీ! ఆగభాషీ!

(ఆగభాషిని నిద్రనుండి లేచిన స్థితిలోప్రవేశము.)

ఆగ—ప్రభూ! వందనములు.

కాల—వందనములకు తొందరలేదు. ఏమి చేయుచుంటివి?

ఆగ—ప్రభువువారు అత్యవసరముగా విజయముచేసినారు—అర్ధరాత్రము............

కాల—నాయవసరములతో నిప్పుడు పనియేమి? చెప్పుము—ఏమిచేయుచుంటివి?

ఆగ—పొద్దుమీఱినందున నిద్దురకొంచె మిప్పుడే యావహించెను.

కాల—కాదు; కాదు; పొద్దుకాదు నీకుమీఱినది! కాలము......పాపము ఈయర్ధరాత్రమున ప్రక్కలోని బల్లెమువలె కాలకేతనుఁడు వచ్చునని యెఱుంగక నీవును—నీరాణియు—స్వేచ్ఛాప్రవర్తనము చేయుచుండియుందురు.

ఆగ—అశ్లీలము ప్రతిహతమగుఁగాక!—ఎంతపాపపు దినము?—

కాల—ఈదినమేయననేల? నేనురానిదినమెల్ల మీకు పాపపుదినమే! అది యీనాడు పండిఫలింపనున్నది. సులోచనయెక్కడ?—

ఆగ—దేవిగారు గీర్వాణవిద్యాభ్యాసము చేయఁబోయినారు.

కాల—ఏమి? విద్యాభ్యాసమా?

ఆగ—ఔను ప్రభూ!

కాల—మంచిది. నేను రమ్మంటినని చెప్పుము.

ఆగ—భాగ్యము. (నిష్క్రమించును.)

కాల—(ఆలోచించి) కావచ్చును. దురభిప్రాయము పాలైతిని. ఐనను- స్త్రీజాతికి, నిశీధసంచారము—బొత్తిగా నిషేధము.

సీ॥ పతిభక్తియుతయైనఁ బరపూరుషునితోడ
భాషించినంత తత్ప్రకృతిమారు;
ఎంతటిసతియైన నేకాంతముగ రాత్రిఁ
దిరిగిన కామంపుఁ దెవులుపుట్టు;
ఘనసాధ్వియైన నేకాకిగానున్న త
ద్వరబుద్ధి పెడతలఁబట్టితీరు;
తరుణి యెంతటిదైన పురుషసన్నిధి నగ్ని
కడ వెన్నవలె బుద్ధి కరగితీరు;
గాన—నొంటిగఁ దిరిగెడు కాంతనొకతె
పురుషు నతికాలముంబాయు పొలఁతినొకతె
అన్యపురుష సన్నిధినుండు నతివనొకతె
నలఘుచరితనైనను నమ్మవలదు—వలదు—॥

(గ్రంథసహితయగు సులోచనతో—ఆగభాషి ప్రవేశము.)

సులో—ప్రభువునకు వందనము.

కాల—సులోచనా! నేడేమైన మత్తిలియుంటివా? లోకమును మఱచితివా?—ఈ నడురేయి, నెందు విహరింపఁబోయితివి?—ఈ మందిరమునకన్న నీకుఁ బ్రియప్రదేశములెందైనఁ గలవా?

సులో—ప్రభూ! నా యపరాధమును, మన్నింపవలెను. తమరులేని రాత్రియందు, నాకీమందిరము అసహ్యముగ దోఁచుచుండును. కావున, నట్టివేళయందు హృదయమును సత్కథాగోష్ఠియందు ప్రవేశపెట్టఁదలఁచి— కపాలేశ్వరాలయము నందలి గీర్వాణ పండితురాండ్రవద్ద—ఈ ప్రశాంత నిశాసమయమున, సంస్కృత భాషాభ్యసనము చేయుచుందును.

కాల—మంచిది. కాని నిశీథములందు నీవిట్లు తిరుగఁగూడదు. తెలిసినదా? ఈసారి క్షమించితిని. ఇంకొకసారి నీవిట్లుచేసినచో నీప్రాణములు దక్కవు; పొమ్ము.

సులో—భాగ్యము. (నిష్క్రమించును)

కాల—ఆగభాషీ!—

ఆగ—ప్రభూ!

కాల—నాకుకొంచెము సురారసమునిచ్చి-శయనమునుసిద్ధము చేయుము.

ఆగ—(సురను అందించును. కాలకేతనుఁడు త్రాగుచుండును-తెర.)

ద్వితీయాంకము.

····oOo····

# కాలకేతనము

## తృతీయాంకము.



1 వ రంగము—కాలకేతనుని సంభాంతరాళము.

పరివేశము—(ఆసీనులై యున్న ఉదయాదిత్యుఁడు, గంగాధరుఁడు, కాలకేతనుఁడు, నీలకంఠుఁడు—నిలువబడియున్న ఆగభాషి—)

కాల—ఉదయాదిత్యా! పాపము నిన్నుఁజూచిన, నాకు మిగుల జాలి గల్గుచున్నది.

మ॥ అవనీరాజ్యము సర్వముం గయివసంబై పోయెగా నాకు; వై
భవమా లేదు; భుజింప నన్నకబళంబా సున్న; నీరంధ్ర సాం
ద్రవనాంతర్గ్గనదేశమే వినుత సౌధప్రాయమైయొప్ప—నీ
నవివేకంబున, నేల నాశనపుటూహంజేతువో బేలవై॥ ౧౪

ఉద—కాలకేతనా! స్వతంత్రశక్తియను జీవనము, నాశరీరమునఁ బ్రజ్వరిల్లునంత దనుక—నాకీకష్టము లొక కష్టములుగావు; చూఁడు—

సీ॥ నీచబానిసయై గణించు నన్నముకన్న
మాధూకరంబె సమ్మతముగాదె!—
ఒకనియాజ్ఞకుఁ దలయొగ్గి బ్రదుకుకన్న
మరణమే యత్యుత్తమంబుగాదె!

సేవకుఁడై—సౌధసీమనుండుటకన్న
ప్రభుఁడై యడవినుంట పరువుగాదె?
అధికారిచేతి పాయసముకన్నను స్వ
తంత్రపుగంజి యధికగౌరవముగాదె?
హైందవులు స్వతంత్రేచ్ఛులై నన్నినాళ్లు
మనభరతమాత పూతయైమనఁగలేదె?
దేశమునకింత దుర్గతిఁదెచ్చినట్టి
మానవాధములమునేడు మనముగామె?॥

ఇంకను—బానిసనై—నీపాదములం గొలువకపోయితినని విచార పడుచుంటివా? కంఠమునఁ బ్రాణవాయువులుండఁగా—యుదయాదిత్యుఁడు నీకంకితుఁడగుట వట్టిది.

కాల—ఊఁ—ఈశ్రీరంగనీతులకేమిలే? కూటికి గతిలేక—నిలువనీడలేక—సంసారసర్వస్వసంఛేదకమగు దుష్కాలము వచ్చునప్పటికి నీవే సమ్మతించి నాకంకితుఁడవై నాపాదములకడకు రాఁగలవు. అంటిదైన్యావస్థకలుగకుండఁగనే నీప్రాణసంరక్షణార్థము నన్ను సేవింపుమని హితము చెప్పుచున్నాను. చెడక వినుము.

ఉద—కాలకేతనా! కష్టముల నందుదుననియా నన్ను భయపెట్టుచుంటివి. ఇంతకన్న కష్టములనెన్నడై నెవ్వడైన ననుభవింపఁగలఁడా? ఇప్పుడు చెడనిధైర్యమిఁకముందుమాత్రము చెడునా?—

చ॥ పరచిరమిత్రవర్గములు వైభవమంతయుఁబోయె కన్నకూఁ
తురు తినఁగూడులేని ఘనదుర్గతికిన్ బలియయ్యె నాకునే
సరణిఁగనంగ రానియెడసైతము ధైర్యమువాయనైతి నా
కరయస్వతంత్రమొక్కటెసుమా! సుఖపాత్రము ధాత్రిలోపలన్॥

నీవు—నాగతికి విచారింపక—నావచ్చినపని నాకర్ణింపుము.

కాల—సరే! చెప్పుము. ఇంతకన్న నధికమర్గము లెట్లుండునదియు నీవే యెఱుంగఁగలవు.

ఉద—వినుము; మేము నీ కంకితులమై యుందుముసు దూరవేక్షను—నీసి జీవితమున సంపూర్ణముగ మఱచిపొమ్ము పరులకు బానిసత్వ-యుదయాదిత్యుఁ డెన్నడును—చాళుక్యరాజుల కపయశం బాపాదింపఁజాలఁడు. కావున—మా పూర్వపరిపాలిత రాష్ట్రింబున్నా మాకిచ్చి—మిత్రుఁడవై—మెలఁగుదువేని మేమును—నీమైత్రి వాటింతుము. అప్పుడు—మన కన్యోన్య సహకారసహవాసంబులు ప్రవర్తిల్లును. కాదందువేని—

గీ॥ మా చెలిమిఁ గోరిన ట్లైన మనెదనీవు-
కాక—శత్రుత్వమే నీకుఁ గాంక్షయేని-
యిలఁ జళుక్యావిశతతి కొక్కింతయేని
కనికరము గల్గఁబోదనుకొనుము మనుము॥

కాల—ఆఁ—ఏమంటివిరా?—మంచితనమున మాటలాడుచున్నందుననా మిడిసిమిడిసి పడుచుంటివి?—సంగర ప్రసంగ మెందులకు?—నా యింటికివచ్చి— ఇంతనిర్భయముగ ప్రచండరుద్రమూర్తి నగు నాయెదుట సంభాషించుచున్నందులకు నీవేమాడువో సుంతై నఁ దలంపనైతివి. నీప్రాణరక్షణమునకే యిప్పుడు ప్రయత్నించుకొనుము.

గంగా—ఓరినీచుఁడా! కాలకేతనా! నీబుద్ధికిఁ దగినట్లు సంభాషించితివిరా! దుర్మతీ! సమర్థుఁడవేని—రణరంగమున మమ్మెదుర్కొ-నవచ్చును. జయింపవచ్చును—నీజయమున కానందింపవచ్చును. కాని— నమ్మించి రాయబారమునకు రప్పించి—మమ్ము బంధింపఁ దలఁప వచ్చునా?

కాల—నీ నీతులు నాకడగాదు. మఱియెవ్వరైన నావకాశమునఁ నీ తత్త్వములను వినువారికడ వ్రాసి పఠింపుము. నాకు ధర్మ

ధర్మములతోఁ బనిలేదు. రాయబారులైనంతనే మీరు శత్రులు
గాకుందురా?—సమయ మొదవినదే సంగ్రామము! వంటయింటి
కుందేళ్లవలె చిక్కినమిమ్ము—శిలువపై బలియిచ్చుటయో—ఖడ్గ
ధారలనదుము మీశిరంబుల నిరికించి కఱుక్కునఁ దెగనేయు
టయో—తప్పదు. మీ కవసానకాలమిదియే!—మీయిష్టదేవ
తములం బ్రార్థించుకొనుఁడు.

గంగా—(కోపముతో కత్తిదూసి)

మ॥ తులువా యేమనిపల్కినాఁడవు? మహాత్ముండైన మారాజుతో—
బలగర్వంబునఁ గన్నుగానక మముం బంధింప యత్నింతువా?
చలదక్షీణ పరాంగశోణ బహుళాస్వాదప్రియానల్ప వి
హ్వలమౌ మత్కరవాలనాగమిదె యాహారించు నిన్ కాచుకో!౧౮
(మీఁది కురుకును.)

ఉద—(వారించి) గంగాధరా! రాయబారము నడుమనా నీ దురా
గతము? వానిని వ్రేలనిమ్ము. ఏమిచేయఁగలఁడు?

గంగా—స్వామీ! వీనిశరీరమును చీల్కలు పేల్కలుజేసినఁగాని నాకు
శాంతిలేదు.

కాల—నీలకంఠా! చూచెదవేమి? కరవాలముతో సిద్ధముగా నుంటివి
గదా!—ఆగభాషీ! కవాటముల నన్నిటిని భద్రముగ, మూసి
వేయుము.

ఆగ—చిత్తము— (నిష్క్రమించి కవాటముల బంధించును.)

కాల—ఓరీ! ఉదయాదిత్యా!—నీకాల మిఁక సమీపించినది. నీదేవునిఁ
బిలుచుకొమ్ము.

ఉద—ఓరి వెకలీ! నేనేల పిలువవలయునురా? అఖిలదిక్కులును—అంత
రాత్మయు—పరమాత్మయు— ధర్మాధర్మవిచారణ శూన్యు
లఁటరా? తలుపులు బిగించి—మమ్ము చంపఁదలఁచినంతనే—

ఆ సర్వాంతర్యామి యిందు లేఁడనుకొంటివా?—నీ దురాచరణము, లాతని కంటఁబడుట లేదా?—

కాల—ఛీ! ఏమి నీమాహాత్మ్యము?—నీభగవంతుఁడువచ్చి—నాపాపములను విమర్శించి—నన్నుశిక్షించి నిన్నురక్షించునా?—నేను మీకొంపల నంటించిననాఁడు నీదేవుఁడెందుచచ్చెను? రూపలీవధంబైననాఁడు—నీదేవుఁడేల రక్షింపలేదు? అట్టి యసమర్థుఁ డిప్పుడువచ్చి రక్షించునా?—

ఉద—ఓరీ! పాషండుఁడా! అట్లయిన భగవంతుఁడే లేఁడా?

కాల—ఎవ్వఁడు భగవంతుఁడు? బలవంతుఁడే భగవంతుఁడు—కావున నేనే భగవంతుఁడను.

ఉద—భగవంతుఁడేలేఁడనుచున్న నీవు నాశనమగుదువురా!

కాల—ఛీ! పిరికివాడ. భగవంతుఁడు—లేఁడు—లేఁడు—అసమర్థులు భగవంతునిపేరట—తమ దుఃఖముపశమింప నిటు లేడ్చుచుందురు. శక్తిగలవాఁడవైనచో—నీకు భగవంతుఁడేల రమ్ము—బాహుశక్తిఁ బ్రదర్శించి నన్ను జయింపుము—లేదా జితోస్మి యనుము.

గంగా—మంచిది—రమ్ము—

కాల—నీలకంఠా! సిద్ధముగనుండుము.

నీల—భాగ్యము.

(అందఱును యుద్ధముచేయుదురు; ఉదయాదిత్య గంగాధరులు చిత్రరీతుల కత్తులుద్రిప్పుచు కవాటభేదనముచేసికొని పలాయితులగుచున్నారు.—నీల॥ ఆగ॥ వెంబడింతురు.)

కాల—(భ్రాంతుఁడై) ఔరౌరా! ఎంతమోసము? ఎంతఖడ్గలాఘవము! నాకు, నేఁడీపాపాత్ము లింద్రజాలముం బ్రదర్శించిరా యేమి?—ఓరీ! ఉదయాదిత్యహతకా! నేఁడు పారుబోతువైననైతివిగాక!—రేపు రణరంగమున నెందుబోయెదవు? మిమ్ముందఱ నీకాలకేతనుఁడు హతమార్చును. నిలుఁడు—నిలుఁడు—

(తెరలో—పెద్దకాంతి కనఁబడును.)

కాల—(విస్మయముతో) అయ్యారే! ఎక్కడి దీమహాతేజము? సహస్ర భానుబింబము లొక్కసారి యుదయించినట్లు—అనేక విద్యుల్లతా నీకంబు లంబరమున నల్లిబిల్లిగా నలముకొనినట్లు—తళుక్కని మెఱసిపోయెను. కానిమ్ము—ఏమికానున్నను సరియే! ఈకాల కేతనునకా భీతి?—

(శివానందయోగి దర్శనమిచ్చును)

శివా—శాంతి—కాలకేతనా! శాంతి—

కాల—ఏమి యీ ప్రశాంతాకారము?

సీ॥ వక్షఃస్థలమునంట వ్రాలిన తెల్లని
డంబైన బవిరి గడ్డంబువాఁడు;
సుప్రశాంతంబయి శుభ్రమై వరదయా
మోహనంబైన నెమ్మొగమువాఁడు;
ఆపాద మస్తకం బంటి యేకంబగు
రంజిత శ్వేత వస్త్రంబువాఁడు;
భువన పావనదివ్య పూపప్రభావ స
ల్లలిత ప్రసన్న ఫాలంబువాఁడు;
ప్రవిమలాజాను దీర్ఘబాహువులవాఁడు;
ఘనతరామేయవక్ష భాగంబువాఁడు;
దీర్ఘకాయుండు దేవతాధిపుఁ డొకండు;
కనుల విందుగ నిందు సాక్షాత్కరించె॥ ౧౯

ఇదియును—ఉదయాదిత్యుఁడు నిర్మించిన యింద్రజాలము గాదు గద!—ఊఁ—ఏ మాయలైన నన్నేమిచేయఁగలవు?—ఓ విపరీతాంగుఁడా! నీవెవ్వఁడవో తెలుపుము. నీమాయలు నాయెదుట సాగిరావని యెఱుంగుము.

శివా—కాలకేతనా! ఏమి నీమూఢత్వము!—ఆకృతిం గనియైన నన్ను గుఱు
తింపజాలవా? అజ్ఞానాంధకారమునుండి విజ్ఞానతేజమునకు రమ్ము.

కాల—సరి—నాకిప్పుడు బోధపడినది. నీవు నాకు శైవమతసారమును
బోధించిన గురుండవు; శివానందయోగివి; ఏమి నీయుపదేశమేమి?-

శివా—మఱచితివి! కాలకేతనా! నీవు హిందూమతధర్మములను సం
పూర్ణముగ మఱచితివి. ప్రాణిహింసయే ప్రధానధర్మముగ భావిం
చుచుంటివి. ఇది నీకు తగదు తగదు—నీహింసయే నీనాశనము
నకుఁ గారణము కాఁగలదు. నీజీవితమధ్యమున నీవాచరించిన
హింసకును క్రౌర్యమునకును పరిమితిగలదేమో యోచింపుము.
ఎంత దుర్మదాంధుఁడవై-ఎంత కఠినమానసుఁడవై-ఎంత పాపపరి
పూర్ణుఁడవై—మెలఁగుచుంటివో యూహించితివా?—నీజీవితము
పాపచ్ఛాయాన్వితము—నీసంకల్పములు దురితకల్పములు నీకార్య
ములు భయానకపూర్వములు— ఇఁకనైన నాప్రబోధమును
మన్నించి—హింసాపథంబు విసర్జింపుము. ఈవిశాలప్రకృతి యొక
మహాసంసారరంగమనియును అందలి సమస్తజీవరాసులును ఏక
గర్భజనితులగుసహోదరులనఁ టివారనియును-నెఱింగి-ప్రకృతిసంత
టిని-సమానముగఁ బ్రేమింపుము. ప్రేమనుమీరిన పవిత్రపదార్థ
ము లేదు-ప్రేమోపార్జనము చేయుము-ప్రేమోపార్జనము చేయుము-

కాల—ఏమంటివి? ప్రేమోపార్జనమా?—ఆమాట కర్థమేమి—నా
స్వగౌరవసంస్థాపనమున, నాకు వాంఛ యక్కఱలేదా?—నా
ప్రతాపమును, నేను—సంరక్షించుకొన నక్కఱలేదా?—
ప్రేమమిషంబున, అధముల యడుగులకు మడుగులొత్తుదునా?
కుటిలమతులఁ గొలుతునా? పిఱికిపందలకు బానిసనగుదునా?—

శివా—శాంతి—కాలకేతనా! శాంతి!!—ఆగ్రహావశుఁడవుగాకుము.
అదియే సర్వనాశనసాధనము—ప్రేమమిషంబున నీవు బానిసవు
కానక్కఱలేదు. ఎప్పుడు నీయందు ప్రేమామృతరసము, వెల్లి
విరిసి పారుచుండునో—అప్పుడే నీ క్షీప్రపంచమంతయు వశంవద

మగును. శత్రువులు నీకు మిత్రులగుదురు. ఎప్పుడు నీవు—పరులను గర్హించితివో—అప్పుడు నీవు పరులచే గర్హింపఁబడుదువు. కావున ఓ కుమారా! శాంతిని దాల్పుము—ప్రేమము నిల్పుము——

కాల—నాకు నీ హితోపదేశము లక్కఱలేదు. నీవు గురుండవైన సరియే—వాని తాతవైన సరియే—నామతమునకు విరుద్ధమగు మాట నాచెవినిఁబడఁగూడదు. నామతమే నాకు సమ్మతము. ఏమార్గమున వచ్చితివో ఆమార్గమునఁ జనుము. నాకు దైవము లేదు.—దయ్యము లేదు——

శివా—దౌర్జన్య వచనములందే నీకానందము గలదా?

కాల—కలదో-లేదో-నీ వడుగనక్కఱలేదు నేనువచింపనక్కఱలేదు. నాకు నేనే దైవమును. ఇహజీవితానందమే నాకు వాంఛనీయము. పరలోకచింత నాకెన్నఁటికి కలుగలేదు. భవిష్యమునఁ గలుగదు.

శివా—ఓరీ! అల్పబుద్ధీ! అట్లయిన నీయాత్మనాశనకాల మాసన్నమైనది.

కాల—ఛీ! ఏమంటివి? నా కాత్మనాశనమా? కాలకేతనునకు నాశనమా? అంతశక్తిగలవాఁ డెవ్వఁడు?-వెఱ్ఱిమాట! ఇంక నాయెదుట. బలుకకుము. పిశాచమా! మాఱుమాటాడితివేని, నీతల తెగును.

శివా—నా తల తెగుట కేమిగాని—రూపలీపిశాచము నిరంతరము నీ వెను వెంటగాచి తిరుగుచున్నది. దానిం జూచి జ్ఞానబోధితుండవుగమ్ము. అదే పరికింపు మాకాశమార్గమున——

(ఆకాశమున రూపలీభూతము భయంకరముగఁ గాన్పించును.)

కాల—(భ్రాంతుఁడై చూచుచుండును.) (తెర)

## తృతీయాంకము.

పన్నెమ విశ్రాంతికాలము.

## 1st INTERVAL.



# కాలకేతనము.

## చతుర్థాంకము.



1 వ రంగము—కాలకేతనుని విశ్రాంతిమందిరము.

ప్రవేశము—కాలకేతనుఁడు ఏకాంతముగ—

(అనుబంధము. 5.)

కాల—(స్వగతము) ఉస్! అబ్బా! ఏమి యీకలవరము! ఏమి యీ మనఃక్షోభము!— ఎందులకీ యశాంతి!—మనస్సున కేమియుఁ దోఁచుటలేదు. ఏమి జరిగినదో నాకిప్పుడు స్పష్టముగ నేమియు బోధపడుటలేదు. నాకన్నులోక యింద్రజాలమును—చూచినవి. దాని తత్వమేమో నిర్ణయించుటకు బుద్ధిచాలకయున్నది! శయనింతమనిన స్వస్థతచాలదు! కూరుచుందమనినఁ గుశలము చాలదు! ఆలోచింతమనిన, నగమ్యగోచరము! ఎక్కడిదా కాంతి? ఎవ్వఁడా గభీరవిగ్రహుఁడు! ఏమి యాపిశాచ రూపలీచ్ఛాయ! ఇది నిక్కమై యుండునా? కాక—కల్పనమా? ఇట్టి యనూహ్యసాధ్యకల్పనముచేయుట కుదయాదిత్యునకు సామర్థ్యముగలదా? అట్టి సామర్థ్యము గల్గియుండెనేని, ఆనాఁడే నన్ను వెఱపింపలేకుండెనా?— ఈ పరాజయములేల? ఈ కాననావాసములేల?— ఈవిపద్దశానుభూతియేల? కాదు. అట్టి శక్తి యాతనికెంతమాత్రమును లేదు......ఒకవేళ నిది స్వప్న

మైయుండునా?—స్వప్నమని సమర్థించుకొనుట కవకాశమెక్క
డిది?—సకలపదార్థములను—స్పష్టముగ నీభౌతికనేత్రములతోఁ
జూచితినిగాదా!—కాంచినదానిని కల యనుకొనుటెట్లు?—జాగ్ర
ద్స్వప్నమధ్యావస్థంగతుఁడనై తల్లడిల్లుచుంటినిగాఁబోలును! స్వ
ప్నావస్థయందైనను ఒకనికి నా కెదురాడుశక్తిగలదా?— ఏమి?
నే డిట్లు ఘటిల్లెను!—ఛీ! ఏమిది? వ్యాకులత్వమున వ్యర్థకాలయా
పనము సేయుచుంటిని! ఇప్పుడు నాకీవ్యాకులమేల? జరిగినది కల్ల
గానిమ్ము. నిజముగానిమ్ము. ఆవిచారము నాకనవసరము ఉదయా
దిత్యుని మూలమునఁగదా-ఇంతజరిగెనని నేను తల్లడిల్లుచుంటిని.
ఆదుష్టుని సపరివారముగ పట్టిబంధించి—యురిదీయించినఁగాని నా
కసితీరదు. పై కార్యమెట్లుకాఁగలదో యట్లగుఁగాక! కతిపయసేనా
సమేతుఁడనై ముందు దాడివెడలవలయు!— (ఆకాశముంజూచి)
అదిగో! గగనాంగనామణి చేలాంచలమునలె వాతాహతి రెపరెపఁ
గొట్టుకొనుచున్న నా **కాలకేతనము!** ఈనీలవర్ణ మశుచిస్మా
రకము. కాలకేతనుఁడు ముందడుగిడినతోడనే— యంతకస్న
మున్నుగ మరణంబులతో నెల్లచోట్ల నశుచిస్థాపన మొనర్చిన
**యోకాలకేతనమా!** నీకు జోహారు! ఇఁక బయలుదేరుము!
చాళుక్యులతో నిప్పుడుగాఁబోవు సంగ్రామరంగతలమున నీయ
దియే విజయఝాంకారము! నీయదియే యానంద తాండవము!
నీయదియే మహాసుప్రభామహిమము! బయలుదేరుమింక—
**కాలకేతనమా!** నీకుజయము! జయము!—ఆగభాషీ!—

(ఆగభాషి ప్రవేశము)

ఆగ—ప్రభూ! ఆజ్ఞయేమి?

కాల—నీలకంఠునిఁ బిలువుము.

ఆగ—భాగ్యము.

కాల—(స్వగతము)గీ॥ కలిగె చిరకాలమునకు సంగ్రామ మిపుడు
పట్టియున్నది తీట నా బాహువులకు
కూడినది త్రుప్పు నా కరవాలములకు
బాహువులఁ గల కండూతి వాయు నేఁడు॥ ౨౦

(అగభాసి—నీలకంఠుఁడు ప్రవేశము)

నీల—ప్రభువు సెలవేమని?

కాల—నీలకంఠా! వచ్చితివా! ఇటువచ్చి కూర్చుండుము.

నీల—(కూర్చుండును)

కాల—జరిగిన సంగతులన్నియు జ్ఞప్తియందున్నవియా?

నీల—చిత్తము. కన్నులఁ గట్టినట్లున్నవి.

కాల—బంధింపఁబడిన కవాటములను బ్రద్దలు చేసికొనఁగలశక్తి యుదయాదిత్య గంగాధరులకు గల్గుట వింతయగు విషయముగాదా?

నీల—కాకేమిప్రభూ! మిగులచిత్రము.

కాల—ఎవ్వఁడో యొక విపరీతవ్యక్తి—మనుజుని రూపమున గాన్పించుట మఱెంత చిత్రముగాదా?

నీల—ప్రభూ! ఔను.

కాల—ఆవ్యక్తి యంతలో నంబరతలమున పిశాచముఁ బ్రదర్శింపఁ గల్గుట యన్నిఁటికన్న నద్భుతముగాదా?

నీల—ప్రభూ! ఇట్టి యద్భుతములను నాజీవితమధ్యమున నెఱుంగను.

కాల—ఇది నిజమందువా? అట్టి సామర్థ్యమువారలకు గల్గెననియే విశ్వసింతువా?

నీల—ప్రభూ! ఇది వట్టి కనుకట్టువిద్యగాక, సామర్థ్యమెట్లగును?—ఉదయాదిత్యుఁడు తప్పక మాంత్రికుఁడై యుండును.

కాల—(సాక్షేపణముగనవ్వి) ఓహో! అటులనా? నీలకంఠా! అట్లయిన నాతని మంత్రము నుపసంహరింపఁగల ప్రతిమంత్రము నీవద్ద నేమియునులేదా?

నీల—ప్రభువా కెఱుంగని క్రొత్తనీలకంఠుఁడు కాఁడుగదా వీఁడు!

కాల—మంత్రమా? మంత్రము—.......ఆగభాషీ! ఇది యంతయు మంత్రమే యందువా? నీ యుద్దేశమేమి?—

ఆగ—ప్రభూ! ఇందు మంత్రమును లేదు. దైవమాయయును లేదు. బహుశః ఇది హృదయానైకల్యవశమున తమకుఁగల్గిన భ్రాంతియై యుండును.

కాల—సెబాసు! ఆగభాషీ! సెబాసు! నీవు నిజముగా నాగభాషివే!... ఓయీ! నీలకంఠా! భగవంతుఁడు—మన్నుఁగుడుచుచు, నిన్ను సృజించియుండును. కాదా నాముఖప్రీతికొఱకై—నాయభిప్రాయమటులే యుండునని యూహించియైన, నాకు వెనుక తాళము వేయుట కట్లు—నోటికివచ్చినదే మాటగా వదరియుందువు. మంత్రమా! మంత్రము—బుద్ధిలేదా నీకు? ఇది మంత్రమెట్లగును? ఆగభాషి చెప్పినట్లు, నీవు—ఒంటెవలె—నొక్కమాఱుగ సారాయి తిత్తులను కడుపులో—నింపుకొని యుంచుకొనుటకే కాని—మఱియెందులకును పనికిరావు—మట్టిబుర్ర నీలకంఠుఁడు!—

నీల—ప్రభూ! సేవకున కింతకన్న జ్ఞానములేకపోయెను?

కాల—సరి; దానికేమి?—నేను మూఁడుదినములలో చాళుక్యులపై దాడివెడలఁదలఁచియున్నాను. మాఱాడక సర్వసేనలను సిద్ధపఱపుము నేను నేటికి విశ్రాంతిగైకొందును. ఆగభాషీ! నావెంట రమ్ము!—

(కాలకేతనుఁడు ఆగభాషి—నిష్క్రమింతురు.)

నీల—(పళ్లుకొఱుకుచు) కుటిలబుద్ధి—విషసర్పము—వీనికడ సేవకత్వము చేయుటకన్న యమపురంబున నివసించుచు దారుణయాతనల ననుభవించుట సర్వోత్తమము!—వీనికి వినాశకాలము సమీపించినది. తొందఱలేదు. కాకుండిన నింతగా నన్ను తృణీకరింపఁడు. ఈమట్టిబుర్రి నీలకంఠుఁడే తన నాశనమునకు గారణమని యీ

మందబుద్ధియైయుంగకున్నాఁడు! ఆలసించిన కొలఁదియు వీఁడు నన్నగౌరవించుచునే యుండును. ఈజైత్రయాత్ర పూర్తిగాక మున్నే వీనిసంహారమును పూర్తిచేసి యీసింహాసనము నధిష్ఠింప కున్న నాపేరు నీలకంఠుఁడుగాఁడు. నేడే—మృగేశునితో సంభాషించి—కర్తవ్యము నాలోచింతును!—

(అనుబంధము 6.) (నిష్క్రమించును.)

(తెర)



2 రంగము—మంగళాంతఃపురము.

ప్రవేశము—మంగళ.

మంగ—(స్వగతము) ప్రాణేశ్వరుని హృదయము విశేషముగ వికలత నొందినది. సంభాషించువారినెల్ల కసరికొట్టుచున్నాఁడు. ఈయున్మాదమే నాప్రయత్నములకు సహకారియగుగాఁక! సులోచనపై నీతనికాగ్రహముఁ బెంపొందించుట కింతకన్న మంచితరుణము దొరకదు. సోదరునకై కబురంపితిని. వచ్చినంతనే—ఏదోయొక నిగూఢవ్యూహమును పన్నవలయును.

(నీలకంఠుఁడు చరచర నడచివచ్చి కూర్చుండును)

మంగ—ఏమి? ఇట్లుంటివి?

నీల—ఏమున్నది? స్వయంకృతాపరాధమునకు చెంపలు వాయించుకొనుచు చేయునదిలేక హృదయమునందే-కుమిలి కుమిలి యేడ్చుచున్నాను.

మంగ—నాగొంతుకోసి—నీగొంతుకోసుకొన్న యవివేకమున కవశ్యముగా నేడ్వవలసినదే; కాని—యిప్పుడేమివచ్చినది?

నీల—న్యాయాన్యాయములుగాని—మర్యాదానుసరణము గాని—పాపభీతిగానిలేని యధికారిని గొల్చుట గొంతుకోసికొనుట వంటిదే

కదా! అనుజీవులకు మానవత్వముగాని మర్యాదగానియుండదా?
అధికారి, సేవకు—నెడమకాల కుడికాల నీడ్చితన్నుచు—కొట్టు
చున్నను—గుమ్మము వదలక నీడ్గిలఁబడి 'కుయ్యో' యని
మొఱుగుచుండు పుచ్చిపోయిన వృద్ధశునకమునకన్న నన్యాయ
ముగఁ జూడవలసినదా?—అట్టి దురాత్ముని ప్రాణములుండఁగా
నుప్పుపాతర వేయించినను పాపమున్నదా?—అజ్ఞానప్రేరితమగు
నుద్రేకమున వెనుకముందు లరయక కప్పకూఁత పామును కని
పెట్టు శక్తిలేక—కలుగులో నివాసము నేర్పరచుకొని యది
కాళ్లువేయునప్పుడు—విషము తలకెక్కి వెఱ్ఱికేకలువేయు నజ్ఞాన
మూషికమువలె నైతిని. కర్మఫలము—కర్మఫలము—(తలఁ
గొట్టుకొనును.)

మంగ—ఎందులకిట్లు చేతగానివానివలె తలగొట్టుకొనెదవు?—సులో
చన, నావంటిదిగాదా? దాని యదృష్టము మూఁడుపువ్వు లాఱు
కాయలుగానుండనేల? నాయదృష్ట మిట్లధోగతికానేల? నీమూల
మునకేకదా—చేతవాతగాని నీ మూలమునకేకదా! తెగత్రాగి,
ఒడలెఱుంగక, వానియెదుట తెయితక్కలాడుచు అవకతవక
ప్రస్తావనముచేయుచున్న నీపై నాతనికేల గౌరవముండును?
చేజేతల నీగౌరవమును, నీవే పాడుచేసికొంటివి ఇప్పుడెవ్వరైనన్న
నేమిలాభము?—

నీల—వాఁడుమాత్రము త్రాగుటలేదా?

మంగ—అదే తెలివితక్కువమాట!—అధికారిత్రాగినది అమృతము;
సేవకుఁడు త్రాగినది సారాయి. అధికారి ననఁగలవాఁడెవ్వఁడు?
అతఁడెట్లైన క్రుమ్మకొనును ఇప్పుడు మనబ్రదుకేకదా బయటఁ
బడినది!

నీల—ఔనౌను. ప్రపంచమిట్టి పెద్దమనుష్యు లనేకులతో నిండియున్నది.
నీవన్నది నిజమే! మఱియెందులకును కాదుగాని—మట్టిబుఱ్ఱ

నీలకంఠుఁడట! మట్టిబుర్రి నీలకంఠుఁడే వీనిని మట్టుబెట్టుటకు కారణము గాకుండునా?

మంగ—హుష్! చాలుచాలు—ఏమా కేకలు? గోడలకు చెవులుండు నని యెఱుంగవా? ఆతఁడింతకును నిన్నేమనెనో చెప్పనేలేదు. లేని పోని యార్భాటము చేయుచుంటిని.

నీల—ఏమనెనో—నీతోవచించిన వచ్చులాభ మేమాత్రమును లేదు. కాని దృఢముగ వాని నాశనమును సంకల్పించితినని మాత్రము నమ్ముము.

మంగ—ఏమనెనో—నేను గ్రహించితిని. "మట్టిబుఱ్ఱ నీలకంఠుఁ"డనెను. అంతేకాదా? నిజమే! అతనిమాటలు నిజమే! నీవు మట్టిబుర్రి నీలకంఠుఁడవుగాక గట్టిబుర్రినీలకంఠుఁడవైనచో—వీరందఱియహం కారములింతగా విజృంభించుచుండెనా?— మనము బానిసలమై అధోగతి నందియుందుమా? నాకు—పరాభవమే—నాకడుపు మసలినంతకాలము నీమొదడునకు, వేఁడికలుగలేదు—స్వయముగ పరాభవము నందినప్పుడు సంతాపపడుచుంటివి.

నీల—ఉండుండు. ఎవరో వచ్చుచున్నారు. చూడనిమ్ము.

(మృగేశుఁడు ప్రవేశము)

మృగే—(వెనుకకు తెరలోనికిచూచుచు) ఉండు; గుమ్మము దాటిరాకు; చెప్పుదెబ్బలు తగులఁగలవు—

నీల—ఏమా తొందఱ? మృగేశా! ఏమి జరిగినది?

మృగే—(వినిపించుకొనక యధాపూర్వముగ) ఆఁ—ఆఁ—ఏమిరా పేలుచుంటివి? నావద్ద కత్తిలేకపోయెనుగాని నిన్నిప్పుడే ఖూసీ చేసియుందును. నీకు చిల్లిగవ్వ నిచ్చుటకైన సమ్మతించియుం దునా? నీయదృష్టము బాగుగానుండుటచే బ్రదికిపోయితివి. మఱి యొకసారి నాచేతఁబడవా?—

నీల—మృగేశా! ఎవఁడు వాఁడు?

మృగే—వాఁడెవ్వఁడో నీకేల? నీవద్ద వేయిరూపాయలున్న నాకిమ్ము—
తెల్లవాఱునప్పటికి తెచ్చి గ్రుమ్మరించెదను.

నీల—వేయిరూప్యములే?—ఏమాయవసరము?

మృగే—ఉస్! అబ్బా! ప్రశ్నలు తరువాత వేయవచ్చును. ముందీ తొత్తుకొడుకును పంపనిమ్ము—

నీల—వాఁడెవ్వఁడో?

మృగే—ఎవ్వఁడా? వాఁడొక నాఁబోటి జూదరి. ఇంకను గ్రహింపలేవా? రెండువేలవరకును గెలిచితిని. పాడుపందెముపడి వేయిరూపాయలప్పుపడితిని. మూఁడురోజులక్రిందట ముత్యాలసాని యింటి వద్ద వీనితో విరోధముపడినందులకై—ఇప్పుడీ చండాలుఁడు బాకీయంతయు వడగ్రక్కుమనుచున్నాఁడు. కానిమ్ము; నేనీకసిఁ దీర్చుకొనకపోను. ముందాడబ్బు వీనిమొగమునఁ గొట్టుము; తెల్లవాఱకుండ తెచ్చియిచ్చెదను. ఏమి మాటాడవు—

నీల—ఇప్పుడింత యకస్మాత్తుగ వేయిరూపాయలు తెమ్మన్న—నే నెచ్చటినుండి తేగలను?

మృగే—ముష్టి వేయిరూపాయలకు మొగము చూచుకొనుచుంటివా? ఛీ! మన అంతరంగమునైన నాలోచించినావు కావే!—(తెరలోనికిఁ జూచి) ఏమిరా ప్రేలుచుంటివి? నేను పరపతిలేని పందనా?...ఛీ! ఈపిసినిగొట్టు పీనుఁగును నమ్మి ఇంతమాట పడితిని. ఏపసిబిడ్డనైనను—ఏయాఁడుదానినైనను చంపి—ఆనగలు దొంగిలితెచ్చియైన నీయప్పు దీర్చెదనుగాని నీవలన మాటపడెదనా? రమ్ము—నాకు పరపతియేలరా? పందా— (పోబోవును)

మంగ—మృగేశా! రమ్ము—ఇదిగో ఈహారము రెండువేల రూప్యముల విలువగలది. దీనిని విక్రయించి వీని ఋణముఁ దీర్పుము. నాకిది మఱల నీయనక్కఱలేదు లెమ్ము—(హారము నిచ్చును)

మృగే—అట్లయిన నిప్పుడు దీనిని విక్రయించునంతటి శ్రమ నాకేల? (హారమును తెరలోనున్నవానికి విసరివేసి) ఓరీ జూదరితొత్తుకొడుకా! నీయదృష్టము మంచిది. పొమ్ము—

నీల—మృగేశా! నీతో పనియున్నది రమ్ము—

మృగే—ఆఁడుదానిపాటి తెగువ నీకు గలుగలేదు. డబ్బుపేరెత్తినంతనే, తప్పుకొనఁజూచితివి. నీతో నాకేమిపని? కాని—జాగ్రత్త! నీ రహస్యము నాచేతనున్నది.

మంగ—మృగేశా! నీవు తప్పు దలంపకుము. అతనిచేత ధనములేనందున, నట్లాడెనేకాని మఱియొకటిగాదు.

మృగే—ఊఁ—నాకందఱిసంగతియుఁ దెలియునమ్మా! నడుమ నీవేమి క్రమ్ముకొనెదవు? ఈదినమున నీవు నాగౌరవము కాపాడకున్నచో ఈతనిపాట్లు తెలియుచుండెను.

మంగ—కూర్చుండుము.

మృగే—(కూర్చుండి) ఏమి నాతో పని?—

మంగ—నీలకంఠా! ప్రస్తుతకార్యము నీతని కెఱిఁగింపుము.

నీల—అతఁ డాగ్రహముతో నున్నాఁడని యనుమానించుచున్నాను.

మృగే—హ హ్హాహ్హాహ్హా—మొగము చెల్లుటలేదు గాబోలును బాబుగారికి! చాలులే చాలు—అవసరముతీరుటతోడనే ఆగ్రహముతీరినది గాదా? ఇంకేమి?—మేము—మీావలె, దీర్ఘక్రోధుల మనుకొంటివా?—

నీల—అట్లయిన సావకాశముగనున్నచో చెప్పెదను.

మృగే—ఓ! కావలసినంత సావకాశము. తిరిగి జూదపువేళదనుక తీరికయే!

మంగ—మృగేశా! నా కావల పనియున్నది. పోయెదను. నీలకంఠుని కోరిక ప్రకారము చేయుము—

(నిష్క్రమించును)

నీల—అట్లయిన—నేను చెప్పిన యాలోచనప్రకారము చేసితివా?

మృగే—ఉండుండు—నామతి యిప్పుడు సారాయిమీఁదికిఁ బోవు చున్నది. ఇంటనేమైన సరుకున్న దా?—

నీల—ఆ—ఇదిగో!—(తెచ్చియిచ్చును)

మృగే—నీవేమియుఁ బుచ్చుకొనవా?—

నీల—నామాటకేమిలే! తుదకేమైన మిగిలినచో త్రాగెదను.

మృగే—ఈరవంత సారాయిలో నిద్దతికి భాగమా?—(గుటగుటసగము త్రాగి) ఇప్పుడు చెప్పుము చిత్తమువచ్చినంతసేపు చిలుకపలుకులు పలికెదను.

నీల—నీ వాతనికడ నుద్యోగములో చేరితివా?

మృగే—ఎవరివద్ద? శాంతికేతనునివద్దనేనా?

నీల—ఔను.

మృగే—చేరుటయేకాదు. చేర్చుకొన్నట్లాతనివద్దనుండి ఆజ్ఞాపత్రమును గూడ గ్రహించితిని.

నీల—ఆపత్రముతో మన కవసరమున్నది. భద్రపరచితివిగాదా?—

మృగే—పూలసానితల్లివద్ద బోనపుఁబెట్టెలో దాచితిని. ఆముసలి దెంత పిశాచపుముండయో తెలియునా?—పదివేలు గణించినను బ్రాఁచి ముండవలె నుండును. త్రాగఁ దలఁచెనా తలమున్కలు గావల సినదే! కాని దాని బొడ్డుపొక్క—నల్లమందుమాత్రము నాలుగు తులములు మ్రింగునోయి—

నీల—ఇప్పుడాపువ్వులసాని తల్లిగొడవ యెందులకు?—మన వ్యవహారము మాటలాడఁగూడదా?

మృగే—ఉండుండు—ఇంకొకమాట చెప్పవలసి యున్నది. సారాకై పున నేనొకమారు దానితో సరసమాడ నారంభించి అప్పటికప్పుడు పుట్టిన ఆశుకవిత్వములో—నొకపాట వ్రాసితిని. దానిని విని

నా తెలివితేటలను—దాని కొండ్రముచ్చు రూపమును—ఏక టాకీని ఏక కాటాలో తూచిచూఁడు.

నీల—అబ్బా! చంపినావు; నీకవిత్వముకాల—నీకాపాదముముండ యెక్కడ దాపురించినది? అభినవకవిత కలంకారముఁ దెచ్చు నాయికను సంపాదించితివే!

మృగే—ఓహోహో! నీవింకను వినలేదు కాబోలును. ఇంకను పెరటిత్రోవనే యుంటివా? మాజాతిలోఁ జేరిన మహాకవులిప్పుడు అనేకులిట్టి పాత్రలనే దొరకఁబుచ్చుకొని పాటలక్రింద ప్రబంధములల్లి—బొమ్మలతోసహా పుస్తకము లచ్చువేయుచున్నారు. సరేకాని నీవు నాతో మాటలాడుచు—మాటిమాటి కాసారాయిబుడ్డి వంకకే చూచుచున్నావేమి? ఇదియిక్కడ నున్నంతసేపు నీవిట్లే చూచుచుందువు. (పూర్తిగాత్రాగి బుడ్డిక్రిందఁబడవైచి) ఓసి వెధవబుడ్డీ!—నీవింక నీచోటు వదలకున్నావేమి?—ప్రాణము పోయిన శరీరమువలె నీవింక నిక్కడ నెందులకు?—(దూరముగ కాలితో తన్ని వేయును.)

నీల—(తనలో) వీనికి నిషా తలకెక్కినది. చెప్పినమాట నర్థముచేసికొనఁ గలఁడో లేదో!—(ప్రకాశము) మృగేశా! స్థిమితముగ నాలకింపుము. కాలకేతనుఁడు రేపుయుద్ధమునకు బయలుదేరును. మేమొకచో విడిసియున్నపుడు సమయముచూచి కాలకేతనునిపై చాటుననుండి కత్తివిసరి పట్టుబడుము. నిన్నాతఁడు విచారింపఁగా—"రాజ్యకాంక్షచే నిన్ను చంపుటకై—నీకుమారుఁడగు శాంతికేతనుఁడే పురికొల్పిపంపె" నని నదరుబెదరులేక వచింపవలెను. అదిగాక ఏదో సందర్భముచూచి సులోచనా శాంతికేతనులకు—సంబంధమనికూడ అనుమానమును గల్గింపవలెను.

కాల—ఓ! నిమిషమాత్రపుపని—కాని కార్యానుకూలమైన పిదప—నీవు నాకు లక్షరూపాయల నిచ్చెదనని వాగ్దానము చేసితివి. జ్ఞప్తియున్నదా?

నీల—నాకు జ్ఞప్తియున్నదిగాని, కైపునందున్న నీకు—నామాటలు జ్ఞప్తియందున్నవో లేదోయని భీతిల్లుచున్నాను.

మృగే—ఎవరికి?—నాకా కైపు?—ఛీ! ఛీ! ఎంత తెలివితక్కువ మాటాడితివి? ఇంతమాత్రమునకే, మతితప్పూదునా?—ఇంతగా డీక నింతత్రాగినను తెలివి దప్పూదునా? అది—త్రాగచేతగాని దరిద్రులమాట! నీవిప్పు డేమంటివో—ఒక్కమాటు చెప్పనా? రేపు—కాలకేతనుని యుద్ధప్రయాణము. మార్గమధ్యమున నొకచో బసచేసినపుడు—కాలకేతనునిపై కత్తి విసరవలెను. అందులకు కారణ మాతనిపుత్రుఁగు శాంతికేతనుని రాజ్యకాంక్ష యని చెప్పి, లంచమిత్తునని నాచే విసరించినట్లు బొంకవలెను. సులోచనా శాంతికేతనులకు సంబంధమనికూడ అనుమానముఁ గల్గింపవలెను. ఇంతేనా!—

నీల—ఔను—

మృగే—మఱి—నాకు కైపెక్కెనను అవకతవకమాటయేల?........ అదిగో! నాల్గుగంటలైనది. జూదపువేళ మీరునుగాబోలును. పోవుచున్నాను. (నిష్క్రమించును)

నీల—వీఁడు—అనుకూలమైనవాఁడేకాని, అపాయకరమైన మనుష్యుఁడు! ఏవేళకు వీనివలన రహస్యప్రచురణమగునో యని ప్రాణము లరచేతనుంచుకొనవలసినదే!—...ఐనను భీతిలేదు; లంచగొండియగుటచే శాంతిపరుపవచ్చును. భళీ!—ఈపతకమే సరిగా సాగెనా—నాకన్న నదృష్టశాలి లేడు—కానీ పైసంగతి చూతము—

(తెర)

---

## 3వ రంగము—కాలకేతనుని శిబిరము.

ప్రవేశము—సుఖాసీనులై కాలకేతన, నీలకంఠులును, నిలచి ఆగభాషి.

నృత్యపానాది వినోదగోష్ఠి సలుపుచుండఁగా—వెనుకనున్న కొండపై నిలువఁబడి మృగేశుఁడు—కాలకేతనునిపై కత్తి విసరును. కత్తి గురితప్పఁగా మృగేశుఁడు పారిపోవును. కాలకేతనుఁడు క్రోధముతో లేచును. నృత్యాంగనలు నిష్క్రమింతురు.

కాల—(పడిన కత్తినితీసి) ఎక్కడిది దీకరవాలము?—ఏదురాత్ముఁడు ఏయభాగ్యుఁడు కాలకేతన క్రోధాగ్నికి శలభంబగుటకు సాహసించె?—

సీ॥ ఏమందభాగ్యుఁడు భీమహర్యక్షు వి
శాల వక్త్రము దూర సాహసించె?
నే రాజవిద్రోహి దారుణానల శిఖాం
తరములఁబడి మాడ దారిదీసె?
నేపాప హృదయుం; డనేక విషోరగా
పూర్ణస్థలమునకుఁ బోవనెంచె?
నేదుష్టమతి భీతిహీనుఁడై కత్తుల
బోనునం, దొదలఁ బూన్పఁ దలఁచె?

నేవిరోధి చండాలుని జీవితంబు
దుర్ణయంబుగ నేటితోఁ బూర్ణమయ్యె;
కాలకేతన ఘోరాసి గసిమసంగ
మరణ మందఁగ నెవ్వఁడీ శరము విసరె?॥ ౨౧

నీల—ప్రభూ! ఆపర్వతోపరిభాగమునుండి ఎవ్వఁడో దీనిని విసరి-యీ వంకకు పలాయితుఁ డగుచున్నాఁడు నేను వానింగట్టి తీసికొని వచ్చెదను. (ఆగ॥ నీల॥ నిష్క్రమింతురు)

కాల—కాదు. కాదు. ఇది యెన్నడును ప్రమాదజనితముకాదు. ఇట్టి నిశితకరవాలమేమి? ప్రమాదమున విసరఁబడుటేమి? అరణ్యముల

యందుండు శబరులు మృగాదులపై—నంబులను విసరుదురు గాని, పర్వతోపరిభాగమునుండి విసరఁబడిన యీ కటారి ప్రమాదసూచక మెట్లగును! బుద్ధిపూర్వకముగ నాప్రాణములం దీయఁ దలంచిన కుటిలుఁ డెవ్వఁడో—ఈపాపపుకార్య మాచరించెను. కానిమ్ము—విచారించెదఁగాక!—

(మృగేశుని బంధించి—ఆగ॥ నీల॥ పునఃప్రవేశము.)

మృగే—పండ్లురాలగొట్టెదను. దూరముగనుండుఁడు పడఁదన్నితినా—పదియామడలదూరమునఁ బడెదరు. నాకు భయమా? నన్నుబంధింపనేల? కత్తివిసరినమాట నిజమే!—కాలకేతనుఁడైన నేమి? మఱియెవ్వఁడైననేమి?—నేనేవచ్చి మాటలాడెదను.

నీల—రాజసన్నిధిని మర్యాదనెఱుంగక మాటలాడెదవా? దుష్టా! నాశనమగుదువు జాగ్రత్త! రాజద్రోహీ!—

మృగే—హాహ్హాహ్హాహ్హా! ఏమంటివి? నాకు ప్రభువా? నాకీతని ప్రభుత్వము వదలి చాలకాలమైనది. నీవెఱుఁగవు కాఁబోలును. ఇప్పుడు నాకు శాంతికేతనుఁడు ప్రభువు! అతని యాజ్ఞానుసారమే ప్రవర్తించుచుంటిని. నేను రాజద్రోహి నెట్లగుదును?

కాల—నీలకంఠా! వానిని నీవేమియు ననకుము. నాతోడనే భాషింపనిమ్ము.

నీల—ఓరీ! మహారాజునకు నమస్కరింపుము

మృగే—ఈజన్మకిదియొక క్రొత్త యాచారమా?

కాల—ఓరీ! నీవు నాఖజానాయందు ధనమునపహరింపఁగా నిన్నుఉద్యోగమునుండి తీసివేసితినిగాదా!

మృగే—ఊఁ—ఘనమైన పనిచేసితివి!—

కాల—సరి. దానిని పోనిమ్ము—ఈకటారి నీదేనా?

మృగే—నాదే!

కాల—నాపై విసరినది నీవేనా?

మృగే—నేనే!

కాల—ఏల విసరితివి?

మృగే—నిన్ను చంపుటకు.

కాల—ఆఁ! ఏమి నీసాహసవాక్యము!

మృగే—సాహసములేక, నిన్నెట్లు చంపఁదలఁచియుందును?

కాల—దుష్టుఁడా! నన్ను చంపఁదలఁచియే కటారి విసరితివా? నేను నీకుచేసిన ద్రోహమేమి? నాఁడే నిన్ను శిక్షింపకవదలుటయా నా దోషము! ద్రోహాత్ముఁడా!—

మృగే—నన్ను తిట్టకు—తెలిసినదా?

కాల—ఏల నన్ను చంపఁదలఁచితివో చెప్పుము.

మృగే—అందుల కొక ప్రత్యేక కారణమున్నది.

కాల—ఆ ప్రత్యేకకారణము చెప్పక తప్పదు. నా మరణమువలన, నీకేమి లాభము?

మృగే—నీమరణమువలన, నాకుఁ గాదుగాని, వేఱొకరికి లాభము గలదు. వారి ప్రేరణముచే, నే నీకార్యము నాచరించుటచేత, నాకు విశేషధనలాభము గల్గును.

కాల—నిన్ను ప్రేరేపించిన దురాత్ముని పేరు చెప్పుము.

మృగే—నేను చెప్పను.

కాల—ఎంత నిర్భయము? రాజద్రోహీ! ఏల చెప్పవు?

మృగే—నేను రాజద్రోహినికాను. నన్ను మాటిమాటి కట్లు పలుకకుము.

కాల—నాపై కత్తివిసరి నన్ను చంపఁదలఁచిన నీవు—రాజద్రోహివికాక రాజభక్తుఁడ వగుదువా?

మృగే—నాకు రాజు వేఱుగానున్నాఁడు. నీవుకావు.

కాల—ఆఁ? నేనుగాక నీకెవ్వఁడురా ప్రభువు?

మృగే—నీ కుమారుఁడు—శాంతికేతనుఁడు.

కాల—శాంతికేతనుఁడెట్లు నీకు ప్రభువయ్యెను?

మృగే—నన్నాతఁడు తన కొలువునఁ జేర్చుకొనెను.

కాల—నేను నమ్మను; నేనునమ్మను. నేను నిరాకరించి శిక్షించిన రాజ ద్రోహినేమి? నా కుమారుఁడు చేర్చుకొనుటేమి?

మృగే—ఇంకను దుర్భ్రమలోనేయుంటివా? ఇదిగో నా కొతఁ డిచ్చిన అధికారపత్రము. (ఒకకాగితము నిచ్చును.)

కాల—(తీసి చదివి) ఆ కుటిలకర్ముఁడేనా—తండ్రి యధికారమున కసహ్యపడి, తండ్రి పాలనమునకు కన్నులుమండి—తండ్రి నాశనము నభిలషించి కటారినివిసరి నన్ను జంప నిన్ను ప్రోత్సహించెను.

మృగే—ఇంతేకాదు. నాకు లక్షరూపాయలు లంచమిచ్చెదననికూడ వాగ్దానముచేసెను.

కాల—ఛీ! ప్రేలకు—ఇక నీకు లంచము ఆ మరణాంత కారాగార శిక్షయే!—నీలకంఠా! వీనిని బంధనములందుంచి శాంతికేతనుని నాకడకుఁ గొనిరమ్ము—

నీల—చిత్తము; ఓరీ! గజదొంగా! నిన్నిప్పుడు బంధించెదను; పద—

మృగే—ఓ! బంధించుకొమ్ము—ఇవిగో! చేతులు—ఇట్టి బంధనము లిది నఱకొక లక్షయైనవి. ఎన్నిసారులు తెగ్రింపుకొనివచ్చితినో లెక్క లేదు. వానిలో నిదియొకటి.

కాల—నీలకంఠా! నాకాగ్రహము మితిమీఱుచున్నది. వీనిని స్థలాంతరమునకుఁ గొనిపొమ్ము—

నీల—పద—(మృగేశుని గెంటుకొనిపోవును.)

కాల—(స్వగతము) తుదకు—నాకడుపునఁబుట్టిన శాంతికేతనుఁడే—నాకు శత్రువయ్యెనా? వినాశకాల మాసన్నమై—ఇట్టిద్రోహముఁ దలంచెనా?—నేను నిరాకరించిన ద్రోహికా తాను నిలువ నీడ నిచ్చుట! వానికి లంచము నిచ్చి—నన్ను చంపఁదలంచెనా?

(అనుబంధము 7.)

(నీల॥ శాంతి॥ ప్రవేశము.)

నీల—శాంతికేతనా! వారే నీతండ్రిగారు—దర్శింపుము.

శాంతి—జనకా! నమస్కారము. అకాలమునఁ బిలువనంపితిరి.

కాల—అకాలమేమి? నీకిదికాలమే? కాలమువచ్చినందుననే పిలిపించితిని.

శాంతి—తమ మాటలు నా కర్థములగుటలేదు.

కాల—(నవ్వి) నామాటలందు నీవెఱుఁగని యర్థమేమియున్నది? ప్రియ కుమారా! కూర్చుండుము. నామనస్సంక్షోభమునంతను—నా ముద్దుకుమారుఁడవగు నీకుఁగాక వేఱెవ్వరికెఱిఁగింతును? అందు లకై పిలిచితిని.

శాంతి—(తనలో) నేడు ఈయన నా కిచ్చుచున్న చనువునుబట్టియు—సంభాషించు వైఖరినిబట్టియు—నాకేమో యనుమానము గల్గుచున్నది.

గీ॥ భయదశార్దూలములు శ్రుతుల్ పలుకుచున్న
మొసలి జనులను నావయై మోయుచున్న
ఖలుఁడయిన దైత్యుఁడు జపంబు సలుపుచున్న
నమ్మియుండుట వెఱ్ఱితనంబుగాదె!— ౨౨

కాల—నాయనా! ఏమియాలోచించుచుంటివి? నేనేమైన, నీవిషయమై వేఱుగాఁ దలఁచితినేమోయనియా?—కాదు; కాదు—నీవంత యనుమానపడనక్కఱలేదు. ఇటుచూడు—నేను చిరకాలము, రాజ్యమేలియేలి, విసిగిపోయితిని. నీవు పెద్దవాఁడవైతివి. అది గాక రాజ్యార్హుఁడవు. వయసువచ్చినవాఁడవు. పరిపాలింపఁదగిన యీడువచ్చిన సమర్థుఁడవు. పైగా—ప్రజారంజకుఁడవు. నాపై—నాపాలనముపై—జనులకు రుచితగ్గిపోయినది. నాకును ఓపికతగ్గిపోయినది. అందుచేత, నీ కీరాజ్యమునిచ్చి—నేను తపస్సుచేసికొనఁ బోయెదను...... ..నే నొక్కమాట యడిగెదను. కుమారా! శాంతికేతనా! నీకు, రాజ్యపాలనాభిలాష లేదా?—

శాంతి—అయ్యో! తమరిట్లాడనేల?—పెద్దవారగు తమరు పరిపాలించు

చుండఁగా మీపాదసేవచేయుచు—జీవింపవలసిన వాఁడనే కాని,
ఇంతలో నాకు, రాజ్యకాంక్షయేమి?—

కాల—(ఆశ్చర్యమున) నిజముగా నీకు రాజ్యకాంక్షలేదా?

శాంతి—ఏల యుండును?

కాల—(నవ్వి) సరి—సరి. నాకిప్పు డర్థమైనది. నేను బ్రదికియుండఁగా,
నీకు రాజ్యకాంక్ష యుండిమాత్రమేమిఫలము?—

శాంతి—అయ్యయ్యో! నేఁడు, మీపలుకు లతివిపరీతములుగ నున్నవి.
ఇది యెట్టి సంభాషణము?—

కాల— నాపలుకులు, నీకర్థములగును. తొందరపడకు. ఇది యెట్టి
సంభాషణమా? నీకోరికలకు సరియైన సంభాషణము!—

శాంతి—నాకట్టికోరిక యెక్కడనున్నది?—

కాల—ఎక్కడ నున్నదియా? మృగేశుని కత్తిలోనున్నది—లక్షరూపా
యల లంచములో నున్నది!—

శాంతి—ఇదియంతయు, నా కగమ్య గోచరముగనున్నది.

కాల—అగమ్యగోచరమా? అగమ్యగోచరము—ఓరీ! పితృద్రోహీ!
నిజజనక మరణాభిలాష మహాపాతకవర్తీ! ఎఱుఁగనట్లు నటిం
తువా! ఈకటారియేమి? ఈకాగితమేమి? చూచితివా?

శాంతి—అవియేమో—నేనేమి యెఱుంగుదును?

కాల—మృగేశు నెఱుఁగుదువా?

శాంతి—మృగేశుఁ డెవ్వఁడు?

కాల—పితృవధోద్యోగమున, నీకు నమ్మిన బంటుగానుండి, నీ కుప
కారము చేయుటకై—ఏపాపాత్మునకు, నీవీ యధికారపత్రి
మును వ్రాసియిచ్చితివో—నుఱచితివా?—నావద్దనా నీదొంగ
వేషములు! కన్నులు పెట్టుకొని చూఁడుము—ఇదిగో నీసంత
కము—నీమొహరు—

శాంతి—(చూచి) ఔను. మృగేశుఁడనువాని కొకనికి, నే నుద్యోగము నిచ్చినమాట నిజమే! కాని పితృవధోద్యోగమని విపరీతముగ, సెలవిచ్చితిరేమి—ప్రభూ!—

కాల—విపరీతమా? విపరీతమా? నాకు శాత్రవుఁడై నాచే, పదభ్రష్టుఁడైనవానికి నీ వుద్యోగము నిచ్చి యాదరించిన దురాచరణము విపరీతముగాదా? పితృవధోద్యోగము విపరీతముగాదా?

( అనుబంధము. 8 )

శాంత—కటకటా! నేడెంత పాపపుదినము !

కాల—సలిపిన ప్రయత్నము సఫలము గాకుండుటచేత నేనా పాపపు దినము? ఏమి మాటాడవు పాపాత్మా!—

శాంతి—ప్రభూ! ఎందుల కీయన్యాయపు మాటలు!—

ఆ॥ తండ్రివైన నిన్ను దైవసమానంబు
గాఁ దలంచుచుంటిఁగాని—స్వప్న
మునను గాని ద్రోహమను మాటఁ దలఁచిన,
పరమ శివుని పదముఁ బాసినట్లు॥— ౨3

కాల—ఛీ! నీమృషా ప్రమాణములను, నాకడ నదరకుము. నీద్రోహ బుద్ధిసంతయు—నెఱింగితిని.

శాంతి—ఆగ్రహము విడిచి ఆలోచించినచో సత్యము తెలియగలదు.

కాల—నన్ను చంపినచో, లక్ష్యరూప్యములను లంచమిచ్చెదనని, నీవు మృగేశునితో ననలేదా?

శాంతి—కల్ల; కల్ల; మహాప్రభూ! కేవల మనృతాలాపము; సాహసము.

కాల—నీలకంఠా? వీనిని సయితము బంధింపుము.

(నీల, శాంతి నిష్క్రమింతురు.)

కాల—(స్వగతము) ఒకవేళ నేనే మూఢుఁడనైతినా? నేనే మృగేశుని యనృతంబులను—మూఢుఁడనై విశ్వసించితినా ?—(ఆలో

చించి) నిజమే! ఇందేదియో—కౌటిల్యము లేకపోలేదు. శాంతి కేతనుఁడు, నన్నుచంపించుటకుఁగాని, నిర్భయముగ నాయెదుట నన్ృతము లాడుటకుఁగాని, తగినసాహసముగలవాఁడు కాఁడు. మృగేశుఁడు లోకాంతకుఁడు. వాఁడెట్టి యసత్యములకైన వెఱువఁడు. కానిమ్ము—వానిని విచారించెద.

( నీలకంఠుఁడు పునఃప్రవేశము. )

కాల—నీలకంఠా! ఈ భయంకరరహస్యము నీకేమైన బోధపడిసదియా?

నీల—(స్వగ॥) మట్టిబుఱ్ఱ నీలకంఠున కిట్టి రహస్యములు బోధపడునా? (ప్రకా॥) ప్రభూ! తమకన్న నధిక మేధావంతుఁడను కానుగదా!

కాల—సరే! మృగేశునిఁ దీసికొనిరమ్ము.

నీల—చిత్తము—(నిష్క్రమించును.)

కాల—(ఆలోచించుచు)

ఉ॥ ఎన్నడులేని మోస మిపుడేటికి గల్గె నభేద్యతంత్రమై
ఎన్నతనంబుచేత, నిటుసేయఁదలంచెనొ శాంతికేతనుం
డన్నరహంతకుండు కుటిలాత్ముఁడు నమ్మగరాదు; వాస్తవం
బెన్నివిధాలనెంచిన నొకింతయుఁ దోఁప దిదేమి చిత్రమో!—అర

(నీల॥ మృగే॥ పునఃప్రవేశము)

కాల—మృగేశా! నాకన్నియుఁ దెలిసినవి. ఇంక, నీ వబద్ధము లాడిన కార్యములేదు. దుష్టుఁడా! నీ వెవ్వరి కుటిలతంత్రమున, నేకీభవించి—నా కుమారునిపై నిట్టి యపనింద నిడితివో—నాకు తెలిసినది. నిజముచెప్పితివా బ్రదికెదవు. అనృతమాడితివా—హతమాదువు.

మృగే—(నవ్వి) ఇంకను, మఱింత కన్నులుమూసికొని, పోవుచుండెనా? గ్రుడ్డితనము మితిమీఱుచున్నది. ఛీ! ఎందులకీచర్చ! నీప్రాణ

ములను దీయఁదలంచినది నేను—తీయింపఁదలఁచినది నీ కుమారుఁడు. శిక్షింపఁదలఁచిన శిక్షింపఁగూడదా?—వేఱెవ్వరో, యీతంత్రమునఁ గలరని, వెకలిమాటలాడెద వేల? మతి చెడి పోయినదిగాఁబోలు నేమి?—పాపము!

కాల—ఆఁ—ఏమిరా దురాలాపీ! ఏమంటివి? నేను గ్రుడ్డివాఁడనా? మతిచెడినవాఁడనా? నన్ను గ్రుడ్డివానిని గావించినవాని గ్రుడ్లు తీయింతునుగాని, మిన్నకుందునా?—

మృగే—సరి—ఇఁక నేమి? అట్లుచేయుము. అది శౌర్యమునకు—పౌరుషమునకు లక్షణము!—పదువురిపై బ్రాముట పౌరుషమా?—

కాల—నాకుమారుని శత్రువులు కొందఱు—నీచేఁ జేయించి, నిన్ని ట్లబద్ధములాడుమని చెప్పిరిగాదా? ఎందులకు బొంకెదవు?

మృగే—మఱల నదే మూర్ఖప్రసంగమా?

కాల—అట్లయిన శాంతికేతనుఁడే నామృతిని సంకల్పించినాఁడా?

మృగే—ఇంకను సందేహముతోనే యుంటివా?

కాల—ఔరా! ఎంతదుర్మదము? ఎంత పితృద్రోహము! దుష్టపరిపంథిశిరచ్ఛేదకుఁడగు నీ కాలకేతనుని మరణమును, కన్నులు దెరువని శాంతికేతనుఁడా సంకల్పించెను! గుండెలలోనున్న కటారినే గుఱితింపఁజాలకుంటినా? ఒడిలోని యగ్నిహోత్రమునే యూహింపకుంటినా? కంఠమునకుఁ జుట్టుకొనిన కాలసర్పమునే గ్రహింపనైతినా? సంకల్పించిన యా తుచ్ఛుఁడు బ్రదుకఁడు. సహాయమైన నీవు బ్రదుకవు. నీలకంఠా! శాంతికేతను నిట కీడ్చుకొని రమ్ము—

(నీల నిష్క్రమించును)

మృగే—హా హ్హా హ్హా హ్హా! నన్నేమో శోధింపవలయుననియా, తప్పుదారి కీడ్వ నెంచితివి? ప్రాణములు పోవుగాక! పలికి బొంకుదునా?

కాల—దుష్టా! నోరు మూయుము. నీ యంత్యకాల మాసన్నమైనది.

మృగే—ప్రతిక్షణమును, నాకు—వీటిలో నొక కాలు—కాటిలో నొక కాలు—చావన్న భయమనుకుంటివా! చంపుటకు రోఁత లేదు; చచ్చుటకు భీతిలేదు.

( నీల, శాంతి ప్రవేశము. )

కాల—ఓరీ! మృషావాదీ! దురితాత్మా! పితృవధోపార్జిత మహాకలుషాభిలాషీ! సంకల్పించిన దురాలోచనము—సల్పిన దురాచరణము—సల్పఁజేసిన మహాదారుణము చాలక, నిరంతరానృత వచః ప్రకల్పనముచే—నాకన్నులను గప్పఁదలఁచితివా? పాపీ! నాతోడనా పరిహాసము! నాకా పరాభవము! నాపైననా నీవధోద్యోగము! కృతఘ్నుఁడా! చండాలుఁడా! గ్రుడ్లు తీయించెదను చూడుము.

( అనుబంధము. 9 )

శాంతి—మహారాజా! తమకు, నేడెట్టి దురాగ్రహ గ్రహావేశమయ్యెనో—నాకుఁదోఁచుటలేదు. ఇదియేమి యావేశము ప్రభూ!—ఏపాప మెఱుంగని నన్ను తమ రిట్లనుటకు గతమేమో, నాకు దోఁపకున్నది! నేనేమి ప్రత్యుత్తర మీయఁగలను?—

కాల—ప్రత్యుత్తరము నాకుగాదు. ఏదురాత్ముని నీవు ప్రోత్సహించి, నామరణమును కన్నులఁ గాంచనెంచితివో—ఆతుచ్ఛున కిప్పుడు ప్రత్యుత్తర మిమ్ము. వానివలననే, నీరహస్య ప్రచురణమైనది. పాపము నెంతకాలము మూటఁగట్టి దాఁచవలయు ననుకొంటివిరా? చండాలుఁడా!

శాంతి—జనకా! మనోవాక్కాయకర్మలచేతను, నేను, నీమరణమును సంకల్పింపలేను. భూమ్యాకాశములుసాక్షి—ఆపరాత్పరుఁడు సాక్షి. నీవేమైన ననుము నేను నిర్దోషిని. నన్నుహింసించి పాపమేలఁ గట్టుకొందువు?

నీల—ఓరీ! మృగేశా! మాటాడవేమి? ఇతఁడు నేను నిర్దోషి నను చున్నాఁడు. నీవే యబద్ధము లాడితివా?

మృగే—(వికటహాసముచేసి) నాకు నవ్వు వచ్చుచున్నది. ఈశాంతికేత నుఁడెంత యనృతాలాపి!

కాల—తుదసారి చెప్పుచున్నాను వినుఁడు. ఇప్పుడు మీయిద్దఱిలో నెవ్వఁ డనృతాలాపియో తేలకపోదు. ద్రోహియగువాని గ్రుడ్లు తీయింతును. నిజము చెప్పుఁడు.

మృగే—ఇంకను నిజముకొఱకే ప్రాకులాడుచుంటివా! బోధపడినదిగా దాని నిజమింకను! ప్రాణములమీఁదికి వచ్చినపుడు నీకొడుకబద్ధ మాడెనుగాని ప్రళయము వచ్చినను, నేను బొంకుదునా? నీవెంత మొండివో నీ కొడుకంతకన్న మొండిబండ. ఇద్దఱికిని సరిపోయి నది.

నీల—దుష్టా! మహారాజును దూషించితివేని తల పగులఁగలదు.

మృగే—ఇంతవఱకు ముదిరిన వ్యవహారమున, ఇంకను తల పగులకుండు ననియే మాటలాడుచుందునా? నీవును నీ ప్రభువునుఁ గలసి, నన్ను చంపుదురేమో? అంతేకదా! ఓ! చంపుఁడు; సర్వసిద్ధముగ నున్నాను. ఈఁతకు మించిన లోతుఁగలదా?

కాల—నీలకంఠా! నీకు మతిపోయినదా? ప్రేలనిమ్ము వానితో నీకేమి?

మృగే—హాహ్హాహ్హా! (వికటముగ నవ్వును.)

శాంతి—ఓరీ! నాతండ్రినిఁ జంపుమని నేను నీతో చెప్పి ప్రేరేపితినా?

మృగే—(కోపముతో) ఛీ! పిరికి. నాతోఁగూడ నబద్ధమా? నా మొగముచూచి మాటలాఁడు; ఇంత పిఱికిపంద విట్టిసాహసమున కేల పూనుకొంటివి? చేతవాతగాని నీమాటలు నమ్మి-నీలంచము నకు లోభించి—నిన్ను విశ్వసించి—నడుము నాకుత్తుక నుత్తరించు కొంటినిగదా! ఛూ! నీమొగము చూడరాదు.

శాంతి—నీవు కడుటక్కరివి! ఆరితేరిన గజదొంగవు! కొంపలుగూల్ప నేర్చిన ఘోరహంతకుఁడవు! నాప్రాణములకునీ వెక్కడదాపురించి తివిరా! నీకు నేనేమి యపకారము చేసితిని. రాజునకు జంకక— పాపమునకు భయపడక—కల్లలకు వెఱువక—అన్యాయముగ నన్ను హతమార్పఁ దెగించితివిగదరా! కుటిలహృదయా! నేనిప్పుడేమి చెప్పుకొనిన నెవ్వరు నమ్మెదరు?

మృగే—మఱి—తండ్రి నేల చంపఁదలచితివి? అనుభవించు—లంచగొండి మృగేశుఁడు లభించినదే చాలునని లక్షరూపాయ లిచ్చెదనని యాశపెట్టి—ఛీ! పాపీ!—

శాంతి—ఎప్పుడురా నేను నీకు లక్షరూపాయ లిచ్చెదనంటిని?

మృగే—ఎప్పుడా? ఎఱుఁగనట్లు మాటాడెదవు! ఎప్పుడో చెప్పుమందు వా? నీతండ్రి మంగళాంతఃపురమున తాగి మైమఱచి దొరలు చున్న తరుణముచూచుకొని కర్కికిసకూడు గతుకఁదలచిన దొంగకుక్కవలె నీవు సులోచనాంతఃపురమున దూరినరాత్రి—

కాల—(అదరిపడి) ఆఁ—ఆఁ—ఏమి? ఏమి? ఇదికూడనా? నాశ్రవణము లేమి వినుచున్నవి? వీఁడు సులోచనతోఁగూడ సాంగత్యము చేయుచున్నాఁడా? ఈ తుచ్ఛుని మఱిగి, సులోచన నన్ను గ్రుడ్డి పందను చేయుచున్నదా? ఓరీ! శాంతికేతన చండాలా! నిన్ను కొడుకవని నమ్మితినిగాని నాగొంతుక మొదలంటఁ గోయఁగల తేనపూత కత్తివని తెలియనైతినిరా!

మృగే—కొడుకుకాఁడు. నీభార్య ఱంకుమగఁడు; నీ షడ్డకుఁడు.

శాంతి—(స్వగ॥) పరమేశ్వరా! నేడెట్టి పాపపుదినము!

కాల—ఆఁ—ఆఁ—గర్భశూలాయమానములగు పలుకులను నేడు కాల కేతనుఁడు వినుచున్నాఁడు. ఇవి పలుకులుగావు. భీకరాగ్ని హోత్రజ్వాలలు. ఇంక నాకెక్కడిశాంతి? చాలు—ఈ ప్రసంగ మును నేనిఁక వినలేను. కడుపునఁ బుట్టిన చండాలుఁడే—కన్న

తండ్రి తాళిగట్టినదానితో అంకుతనము చేసెనన్న, నిఁక నీలోక మున నమ్మఁదగిన వాఁడెవ్వఁడు? ప్రపంచమంతయు ద్రోహసంకు లము! నమ్మఁదగినవాఁడు నా కొక్కఁడును లేఁడు. అందఱును ద్రోహులు; ద్రోహులు—కంటికిఁ గనఁబడిన పాపాత్ముల నంద ఱను, కఱకఱఁ దెగఁగోసి, పీకలు చేతఁబుచ్చుకొని, రక్తమును తనివిదీర గుట గుట ద్రావి, ఆకాశమునకు బంతులవలె నెగుర వేసినఁగాని, నాగర్భదావానలము చల్లారదు......కాదు కాదు. నీలకంఠా! ఈమృగేశుని జన్మాంతము కారాగారమున నుంచి, దినమునకు సోలెడు యుప్పు తినిపించి, కఠినముగ శిక్షింప శాసిం పుము. ఈ శాంతికేతను నిప్పటికి చెఱనుంపుము. రేపు వీని గ్రుడ్లు దీయింతును. (నిష్క్ర॥)

(తెర)

---

## 4 వ రంగము. పురవీధి.

ప్రవేశము—నీలకంఠ మృగేశులు.

నీల—సెబాస్! మృగేశా! చక్కని సాక్ష్యమిచ్చితివి. ఈకల్లోలముతో కాలకేతనునిమతి పూర్ణముగ చెడిపోయినది.

మృగే—మృగేశుఁడన్న నేమనుకొంటివి? కాని—నీవేమియు మాట లాడక మొద్దువలె నిలువఁబడితివేమి?

నీల—నేనేమి మాటలాడిన నిజము బయల్పడునో—యని సగముచచ్చి యుంటిని. కాని—నీవింక కొన్నినాళ్లు కారాగృహముననే యుండి—కాలకేతనుఁ డిది, మఱచినతరువాత పారిపోఁగూడదా?

మృగే—ఆఁ—ఆఁ— మఱల నింకొకదారిఁ ద్రొక్కుచుంటివా? నీల కంఠా! ఏమనుకొంటివోసుమా! నీప్రాణములు నాచేతులో నున్నవి. నీ వినాశముఁగూడ నేనే సంకల్పింపఁగలను.

నీల—మృగేశా! కోపపడకుము. అట్లుచేసిన నెట్లుండునోయని—మాట వరుస కంటిని.

మృగే—నీకేల? చెరసాలనుండి మృగేశుఁడు పారిపోయెనని చెప్పుము. కాలకేతనుఁడు కారాగృహాధికారిని చంపినఁ జంపనిమ్ము.

నీల—అట్లే కానిమ్ము.

మృగే—నా లక్షరూపాయలు నాకిమ్ము. నాకిప్పుడు సారాయిపిచ్చి యెత్తుచున్నది. ఇఁక సానివాడ—సారాయంగడి—స్వర్గలోకములు కానున్నవి.

నీల—ఇదిగో! నీధనము కొనిపొమ్ము— (ఇచ్చును.)

మృగే—నాతో మఱల పనివచ్చినప్పుడు పిలువుము. నేను నీకు మూఁడు చోట్లు చెప్పితినిగాదా! అక్కడ తప్పక దొరికెదను. (నిష్క్ర॥) నీల—(స్వగతముగ) ఇప్పుడు నాస్థితి విషమమైయున్నది. కాలకేతనుఁడెఱుంగకుండ ఖజానాలోనుండి తీసి యీలక్షరూపా యలును వీని కిచ్చితిని. కారాగృహమునుండి మృగేశుని విడిచి నందులకు సయితము నాకేగతి గలుగనున్నదో తెలియదు. ఎవ రది?—

(మంగళ—ప్రవేశము.)

నీల—మంగళా! ఏమియిది? మనలనెవ్వరును చూచుటలేదుగదా! అంతఃపురకాంత విట్లర్ధరాత్రిమున వీధిలోనికి వచ్చితివేమి?

మంగ—ఇంటికిరమ్ము. సులోచనను పరిభవించుటకు మంచియుపాయ ముదొరికినది.

నీల—ఎట్లు?

మంగ—శాంతికేతనునితల్లి యగుధారుణి—తనకుమారునెట్లైన రక్షింపు మని నాకాళ్లపై బడినది. సులోచనను వేఁడుకొంటివేని ఫలితము గలుగునని పంపితిని. సులోచన తనపై రాజునకు ప్రేమగలదను

నమ్మకముచేత—శాంతికేతనుని రక్షింపుమని రాజును ప్రార్థింపక పోదు. ఇదివఱకే—వారిరువురకును సంబంధమని అనుమానించు చున్న కాలకేతనుఁడు తత్ప్రవాదమును పూర్ణముగ నమ్మి సులో చనను చంపును. అంతటితో—నామార్గకంటకము వదలిపోవును.

నీల—ఈనడుమివీధిలో—మనకీసంభాషణము తగదు. మందిరమునకురమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

(తెర)



5 వ రంగము—కపాలేశ్వరాలయము.

ప్రవేశము—ప్రార్థించుచు సులోచన.

సులో—(దైవప్రార్థనచేయుచుండును.)

(అనుబంధము 10.)

(తెరలో) తల్లీ! సులోచనా! నాకు పుత్రభిక్ష నిమ్ము.

సులో—ఎవరి దీయార్తధ్వని?

ధారు—(ప్రవేశించి సులోచనపాదములంబడి) తల్లీ! సులోచనా! నాకు పుత్రభిక్ష నొసంగుము.

సులో—లెమ్ము—భాగ్యవతీ! పరమేశ్వరుఁడు నీదుఃఖముం బరిహరిం చునుగాక! నీవెవ్వరు?

ధారు—అమ్మా! నీవు నన్నెఱుంగకున్నను నేను నిన్నెఱుంగక పోలేదు. మిమ్ము వివాహమాడుటకు పూర్వమే—తనభార్యనగు నన్ను కాలకేతనుఁడు విడిచివేసెను. నేను నీకు సవతి నగుదును.

సులో—తల్లీ! ధారుణీదేవివా? అయ్యయ్యో! ఎన్నినాళ్ళకు నిన్నుఁ జూచితిని. ఇట్టిస్థితిలో నీవు రానేల?

ధారు—ఏమిచెప్పుదును? ఎవరో దుష్టులు కల్పించిన దుష్ప్రవాదము లను నమ్మి—మహారాజు నా కుమారుఁడగు శాంతికేతనుఁడు

తన్నుఁ జంపఁదలంచెనని తెల్లవాఱునప్పటికి వాని గుఱ్ఱిల్లుదీయ శాసించెను.

సులో—అయ్యయ్యో! అతఁడట్టివాఁడుకాఁడే!—ఏదుష్టులు బోధించిరో కదా!

ధారు—అమ్మా! ఇఁక యోచనములకెడములేదు. తెల్లవాఱిన ఫలము లేదు. నీవుచెప్పినచో—రాజు శాంతించునని యందఱు ననుచున్నారు. నాకు పుత్రభిక్ష నొసఁగుము. నీ పరోపకారపరాయణతను భగవంతుఁడు మఱచిపోఁడు.

సులో—అమ్మా! రాజుహృదయము నెఱింగియు, నీవిట్లాడిన నే నేమనఁగలను? ఆతఁ డొకరిమాట వినువాఁడైనచో, నీ కీదుర్గతియేల కల్గియుండును?

ధారు—అయ్యయ్యో! సులోచనా! నీవేయిట్లన్న—నాకింకేదిదారి? నిర్దోషియగు నాకుమారుఁడు గ్రుడ్లు తీయఁబడి, బలవన్మరణము నొందవలసినదేనా?-ధర్మాధర్మములు లేవా? భగవంతుఁడు లేఁడా?

సులో—ఊరడిల్లుము. తల్లీ! ఊరడిల్లుము.

ధారు—నాకింకెక్కడి యూరట!—పతి నన్ను బాసినను జీవచ్ఛవము వలె ఏకపుత్రునిఁ జూచుకొని యీపాడుశరీరమును నిలిపియుంటినే! ఇఁకనేను బ్రదికియేమి ఫలము? నాపుత్రుని బలవన్మరణము నిఁకనేను చూడలేను—చూడలేను— వాని మరణమునకన్న ముందుగా—నాశిరస్సు నీపావనాలయమున బ్రద్దలు గొట్టుకొని పరలోకముం జేరెదను. (తలఁగొట్టుకొనును.)

సులో—(వారించి) తల్లీ! ఇదియేమి సాహసము? ఆత్మహత్య చేసికొందువా? ఊరడిల్లుము.

ధారు—నాకుమారుఁడులేని ప్రపంచము నాకేల? ఈజీవనమేల? ఏమి చూచుకొని నేను జీవించుట?

సులో—తాళుము. నా కిప్పుడొక యాలోచనము తోఁచినది. దీనిని తనకడకుఁ బంపినచో—ఎట్టి స్థితియందయిన—నాకు దర్శన మిచ్చెదనని—వరమిచ్చి—నాథుఁడు పూర్వమొకనాడు నాకీ యంగుళీయకము నిచ్చెను. శాంతస్వభావుఁడగు శాంతికేతనుని ప్రాణరక్షణమునకై—ప్రయత్నించెదఁగాక! విచారింపకుము.

ధారు—తల్లీ! నిన్ను జగత్పతి సదా రక్షించుఁగాక!

సులో—(ఉంగరమును దోసిటనుంచుకొని ప్రతిమకెదురుగా మోకారించి) ఓజగత్త్రియాధినాథా! కృపాసుధా!

ఉ॥ పాపమెఱుంగనట్టి యొకబాలుని ప్రాణముఁ గావఁబూని నే
నీపనికొప్పుకొంటి; హృదయేశుఁ డతీత కృధామనస్కుఁడై
దీపిలుచున్నవాఁడు; ననుతేల్చెదొ ముంచెదొ? నీదెభారమా
నీపదపద్మసేవనమునే మదినమ్మితినో జగత్పతీ!

ఆగభాషీ! ఆగభాషీ!!—

(ఆగభాషి ప్రవేశము.)

సులో—ఈయంగుళీయమును గొనిపోయి—ప్రాణేశ్వరునకిచ్చి- దర్శనము నపేక్షించితినని చెప్పుము.

ఆగ—ఇప్పుడు నీకాయన దర్శనమేల తల్లీ!

సులో—ఆగభాషీ! తెల్లవాఱునప్పటికి గుర్రముత్రొక్కఁబడనున్న శాంతికేతనుని సంరక్షించుటకై—నేను కపాలేశ్వరుని సాక్షిగా నీమెకు వాగ్దానము నొసంగితిని.

ఆగ—అయ్యయ్యో! నీకు నేడెట్టివిపరీత సంకల్పముగలిగెను. వలదు—వలదు; తల్లీ! విరమింపుము. ఈసంకల్పమును మానుము. కాలకేతన ప్రభువు నేటిరాత్రి కాలయముఁడై యున్నాఁడు. ఆయన యెదుటఁబడినప్రాణి నేఁడు బ్రదుకుట కల్ల! కంటబడినవారినెల్ల కటారి పాల్సేయ సిద్ధసంకల్పుఁడై భీషణాకారముతోనున్నాఁడు.

సులో—ఉండనిమ్ము—న్యాయము విచారించెనా—ఒకనిర్దోషిని రక్షించి పరిభువుదయకుఁ బాత్రురాలనగుదును. సంహరించెనా—నిశ్చింతతో పతికరంబులఁ బరమపదవిఁ గాంచెదను.

ఆగ—తల్లీ! నీనాశనమునకే—నీకిట్టి దృఢనిశ్చయముగల్గినది. అదిగాక నీవు విచారపడెదవని నీకిదివఱ కెఱిఁగింపలేదు. ఒక చోరుని మాటలను నమ్మి నీకును శాంతికేతనునకును సంబంధముగలదని నీ శీలమునం దాయన ఇదివఱకే వెఱ్ఱిసందేహముం బూని యున్నాఁడు. ఇట్టి యాతఁ డీరాత్రినీవు కంటఁబడినంతనే—నఱికి వేయునుగాని న్యాయపాలనము చేయునా? వట్టిది; వట్టిది. ఏమియు ప్రయోజనములేదు—మానుము; మానుము.

సులో—కటకటా! ఎంతపాప మెంతపాపము!—నా శీలమునందు సయితము ప్రభువు సంశయించెనా? ఇట్టి నాబ్రదుకే నిష్ఫలము. ఈమిషచేనైన జచ్చెదను. ఇదే యంగుళీయము ప్రభువునకు నీవీయక తప్పదు. (ఉంగరము నిచ్చును)

ఆగ—తప్పదా? తల్లీ! తప్పదా?

సులో—అబ్బా! జాగేలఁజేసెదవు; పొమ్ము.

ఆగ—నాచావుకూడ నీరాత్రియే స్థిరము. చేయునది ఏమియునులేదు. ఎంతఘోరము.

సులో—కపాలేశ్వరుఁడు నీకు మృతిగల్గకుండ రక్షించునుగాక! పొమ్ము.

ఆగ—పోయెదను. తల్లీ! పోయెదను. ; కాని, నీకును నాకును ఋణము దీరిపోయినది నేనిఁక నిన్నుచూడను. నేనిఁక మృత్యుదేవత కోఱలలోనికే పోవుచున్నాను. సెలవు తల్లీ! సెలవు!—

(నిష్క్రమించును.)

సులో—(తనలో) ఆహా! ఇన్నినాళ్ళనుండియు నాప్రవర్తనముం జూచుచున్నప్రభు వెంతలో భ్రాంతుఁడై నా సౌశీల్యమునందు సంశయమునందెను. ఇఁక నా కీబ్రదుకేల?

సీ॥ ఇన్నివత్సరములు నితర చింతలులేక
పతియె దైవంబని బ్రదికినాను;
ఏవేళ నాథుని పావనాకారమే
నిజమానసంబున నిలిపినాను;
ఏమాటలాడిన హృదయేశునామమే
వేమారు నోట జపించినాను
పతియాజ్ఞయే నాకు పావనపత్రమని
ఎప్పుడు శిరసావహించినాను
కటకటా! నేటి కాతని కరుణతొలఁగె
నింక నేమున్న దింక నా కీధరిత్రి
అసువులను పతి నిశితాసికప్పగించి
సురుచిరానందపదవినిఁ జూరగొందు॥ ౨౬

అమ్మా! ధారుణీ! రమ్ము—పతియానతి యగుదనుక నాయింటనే నిశ్రమింపుము.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

(తెర)



5వ రంగము—కాలకేతనుని ఏకాంతశాల.

(ప్రవేశము—కాలకేతనుఁడు ఆలోచించుచు క్రోధముతో)

కాల—(స్వగతము) చాలును—ఆకారణము చాలును—అంతకన్న విశేషకారణ మక్కరలేదు. అకులటయు నాకృతఘ్నుఁడును ఏకశయ్యపై రతిసౌఖ్యము ననుభవించుచుండఁగా—చూచినవారుందురా? ఉన్నను వచింతురా? నేనులేని యర్ధరాత్రమునవానికి దీనియింట నేమిపనియున్నది? ఇంకేమి పనియుండవలెను? అదియే పని. ఈపంద నెలకుపమనైదుదినములు—పరకాంతా

మందిరమున నుండునని బాగుగ గ్రహించినాఁడు. దానితోఁ జేరి
యథేచ్ఛముగ వ్యభిచార వ్యవహారమును సాగించినాఁడు.
ఓరీ! శాంతికేతనచండాలా! నీ మొగముతీరుఁజూచి—నీ దొంగ
నడకలనుఁ జూచి——నీ నంగిమాటలనుఁ జూచి——ని న్నెంత
సజ్జనుఁడ వనుకొంటినిరా! దుష్టా! పడుచుఁదనఁపు నొడలి తిమ్మి
రియే ప్రధాన మనుకొంటివిగాని—తల్లివావినైనఁ దలంప
నైతివిగదా! ఛీ! నీకది యెక్కడితల్లి? నీవు నాకెక్కడి కుమా
రుఁడవు?.........ఓసీ! జగన్మారిణీ! కులటాగ్రగణ్యా! హం
తకీ! సులోచనా! ఎన్ని చమత్కారములాడి, ఎంతకపటాభినయ
మొనరించి—తుదకెంత దుష్కృత్య మాచరించి, నాఱొమ్ము
మీఁది కుంపటివయితివే! పాపిసీ!—ని న్నుప్పుపాతర వేయింప
వలయు. కత్తులబోనులందు పొరలింపవలయు... (ఆకాశముం
జూచి) ఇంకను తెల్లవారలేదు; కానిమ్ము—తెల్లవాఱు దనుక
నాకు నిద్రలేదు- వాని కన్నులవెంటఁగారు రక్తముం జూచినఁ
గాని నిద్రపట్టునా?—అందఱిపైఁగల విశ్వాసమును నామనస్సున
నంతమైనది. ఆగభాషిని సయితము సమ్మను. ఇంత యతివిన
యముగలవాఁడు వీఁడెంత హంతకుఁడై యుండునో!—(సుర
ద్రావి) ఛీ! ఛీ! పాపిమనస్సా! ఏమనుచుంటివే? సులోచన నిర్మల
చరిత్రయనియా? ఓహోహో! అందఱి మనోనైర్మల్యమును
ఒకటితరువాత నొకటిగా బయల్పడుచునే యున్నవిగాదా?
చాలు చాలును. ఇంతటితో నీభ్రమ చాలు. ఈ ప్రపంచమున—
నాశ్రేయముం గోరినవాఁ డొక్కఁడును లేఁడు. అందఱను
హతమార్చవలె—నిష్కంటకుఁడనుగావలె— కానిమ్ము—ఒకొ్క
క్కని నీరాత్రి నామావశేషము చేసెద.

( ఆగభాషి భయముతో ప్రవేశము. )

కాల—వచ్చుచుంటివా? రమ్ము-రమ్ము—అతివినయభూతమా! రమ్ము—నాయెదుటకు.

ఆగ—(స్వగ॥) నాకు ప్రాణాసన్న కాలము వచ్చినది. అనుకొన్నంతయు నైనది.

కాల—ఏమి వచ్చితివి?

ఆగ—ప్రభూ! సులోచనాదేవిగారు తమ దర్శనము నపేక్షించుచు—ఈయంగుళీయము నంపినారు.

కాల—ఏమి? సులోచనాదేవియా? నీచేత నంగుళీయము నంపినదా? నాదర్శనముం గోరినదా?...ఓరీ! నీగ్రోపిశాచమా! ఆ యుంగరము నుతెచ్చుటకు నీకు బుద్ధిలేదా? పంపుటకు దానికి బుద్ధిలేదా?

ఆగ—ప్రభూ! నేను వలదనుచునేయుంటిని. ఆమె బలవంతమున—

కాల—బలవంతమా? తుచ్ఛుఁడా! ఇట్టి బలవంతముననేనా ఇదివఱకు నీవు దానికి అంకుమగలను తార్చితివి!

ఆగ—పాపము శమించుఁగాక!

కాల—పాపముగాదు. ప్రాణము శమించును. నీసహాయము లేకున్న నాకెఱుకలేకుండ నీరక్షణమునందున్న సులోచనాంతఃపురమున కుక్కలేల దూరినవిరా?

ఆగ—నేనెఱిఁగినంతవఱ కెవ్వరును రాలేదు.

కాల—రాలేదా? రాలేదా? అనృతములుకూడనా? నాయెదుట? చావు నీగ్రోభూతమా! చావు—

(పొడువఁగా ఆగభాషి మరణించును.)

కాల—ఒకపీడ వదలినది. కొంత మనశ్శాంతి గలిగినది- సేవకా! సులోచనను రమ్మంటినను ము.

సేవ—భాగ్యము. (నిష్క్రమించును.)

కాల—(సురద్రావి) సకలప్రాణిసముదాయము కాలకేతనుఁడన్న గడ గడ వణకుచుండ—ఈపాపిని నేనన్న భీతిలేక—పతి నగు నా కంట దుమ్ముగొట్టెనా? దుష్టాత్మురాలు—కానీ—చూచెదను.

(సులోచన ప్రవేశము.)

కాల—ఎవరది? సులోచనారాణి? ఎవరికిరాణి?—కాలకేతనునకా? కాదు కాదు—శాంతికేతనునకు—రమ్ము. అభాగ్యురాలా! రమ్ము. ఇప్పుడే త్రాగిన యొకనివేడి రక్తముచే దాహము పూర్ణముగాఁ దీరక నీకొఱకై—గుటకలుమ్రింగుచున్న కరవాల మిదిగో! పగు నుగనున్నది. రమ్ము—

సులో—(అగభాషినిఁజూచి) హా! ఇది యేమిభయంకరము! అగభాషి హతుఁడయ్యెనా?—

కాల—ఛీ! వానికొఱకు దుఃఖపడకు. నీకల్లయేడ్పులు—నీ దొంగవేష ములు—కాలకేతనుని యెదుటకాదు. రమ్ము—నీ కంగుళీయ మిచ్చినమాట నిజమే. ఇచ్చునప్పుడు ఎట్టిసమయమందైన సరియే—నీకు దర్శనమిచ్చెదనని పల్కుటయు నిజమే. అందులకై ఈసమయమున, నాకు దీనిని పంపితివి. సరి—నీయందు దోషము లేదు. అందులకే దర్శన మిచ్చితిని. ఇప్పుడు నీరాకకు కారణ మేమి?

సులో—ప్రభూ! ఆగ్రహించిన వచింపఁజాలను.

కాల—ఆ—సరి. ఆగ్రహింపను. చాలశాంతముగఁ గూర్చుంటిని. చెప్పుము. నీరాకకుఁ గారణమేమి?—

సులో—శాంతికేతనుఁడు, నిర్దోషియని.........

కాల—ఆఁ—రమ్ము; రమ్ము—అదియేదారి. ఆమాట చెప్పుదువో లేదో యనియే శాంతించితిని. చెప్పుము; శాంతికేతనుఁడు నిర్దో షియా? ఎందుచేత? యథేచ్ఛముగ నీతో వ్యభిచరించుట చేతనా?

సులో—ఈ దుర్బోధ తమ కెవ్వరు చేసినారోకాని—

కాల—ఛీ! చాలింపుమిఁక—నోరువిప్పకు. నాకొకఁడు దుర్బోధ చేసెనా? నీవు వింటివా?—మీపాపకర్మము నెవ్వరు నెఱుంగరను కొంటివా? పశువా! ప్రేలరీ! నన్ను గ్రుడ్డిపందనుజేసి కన్నులలో కారముజల్ల నెన్నినాళ్లనుండి ప్రయత్నించుచుంటివి.

సులో—ప్రభూ! నేను నిర్దోషిని—శాంతికేతనుఁడు నిర్దోషి—అతని ప్రాణములు రక్షింతునని యాతని తల్లికి వాగ్దానముచేసితిని. నా మాట నిలుపుము. అతనిని రక్షింపుము. (పాదములపైఁబడును.)

కాల—పాదములు వదలుము. ఱంకుమగని రక్షించుకొనఁ దలఁచి లజ్జ లేక వచ్చితివా! కులటా! (కాలితోఁ దన్నును)

సులో—ఏమైన ననుఁడు. అతని రక్షించినగాని మీపాదములువిడువను.

కాల—రక్షించుట నట్టిది. కాళ్లు వదలు.

సులో—ప్రభూ! రక్షింపుము. నాకు నీ పాదములే శరణ్యము.

కాల—దుష్టాత్మురాలా! నాయాజ్ఞ మీఱెదవా? చావు కలుషస్వరూపిణీ!— (పొడుచును—సులోచన మరణించును)

కాల—హా! పీడకపీడ వదలినది. ఎందఱు నాయెదుటకు వచ్చినను ఈ రాత్రి చంపకమానను. కృతఘ్నస్వరూపపంకిలమగు నీప్రపంచము నిర్మానుష్యముగావలయు. ఇంకను పాడురాత్రి గడువలేదా? తెల్లవాఱనక్కఱలేదు—సేనకా! శాంతికేతనుని రమ్మనుము.

సేన—భాగ్యము— (నిష్క్ర—)

కాల—(మఱలఁదాల్చి) కాలకేతుని జీవితనాటకమునం దిది మహా సుప్రసిద్ధ భీకరమగు కాళరాత్రి యగుఁగాక! శాంతికేతన చండాలుఁడింకను రాలేదా?

(శాంతికేతనుఁడు ప్రవేశము.)

శాంతి—తండ్రీ! వచ్చితిని.

కాల—హుం! నేనింక నీకుతండ్రినా? ప్రార్థింపుమని ప్రాణభీతిచే అం కులాఁడిని నాకడకుఁ బంపితివా? కుటిలా! నీగుండ్లు గీసెదను.

చూచితివా? ఈరెండుశవములను—వానితో పాటయ్యెదవు. ఇప్పటికైన నిజము నొప్పుకొనుము. సులోచనతో సంబంధము చేసితివా? నన్నుజంప మృగేశుని బ్రేరేపితివా?

శాంతి—ఛీ! ఏమి నీరాక్షసకృత్యము? పుణ్యాత్ముఁడగు నాగభూషిని పరమ పతివ్రతయగు సులోచనను చంపితివా? ఓభయంకరకాల కేతనాసురా! ఇప్పుడు నిజముగ నీవు నాతండ్రివగుటకు లజ్జించుచున్నాను. నన్ను చంపఁదలచినచో చంపుము. గుండ్లుతీయుము. నీయిచ్చవచ్చినట్లు చేయుము—కాని—నీగతి తుదకేమగునో—యూహించుకొనుము. నిర్దోషులను వధించిన మహాపాతకము పెనుభూతమై నీరక్తముం ద్రావఁగలదు. చండాలుఁడా! కిరాతుఁడా! సజ్జనవిద్రోహీ! ఎంతెంత దుష్కార్యము లాచరించి బ్రదికియుంటివిరా? మహాపాపీ! భగవంతుఁడున్నచో—నీపాపములకు ప్రాయశ్చిత్తము సలుపకపోదు. నీశిరస్సు సహస్రచ్ఛిన్నములు కాకపోదు—కటకటా! ఎంతదారుణము! ఎంతఘోరము! ఎంతదుష్కర్మము! ఎంతదురాచరణము! చూడ దుర్భరము! దుర్భరము!!

కాల—తులువా! నన్ను పాపాత్ముఁడనుచుంటివా? నీకిది మరణసన్నిపాతము! నిన్నింక బ్రదుకనీయను. నీలకంఠా!

(నీలకంఠుఁడు ప్రవేశము)

కాల—సిద్ధముగనుంటివిగాదా?

నీల—చిత్తము.

కాల—వీని గుండ్లుతీయుము.

నీల—(శాంతికేతనుని గుండ్లుతీయుచుండును రక్తముకారును) (తెర)

•••○○○•••

చతుర్థాంకము.

ద్వితీయ విశ్రాంతికాలము.

2nd INTERVAL.

# కాలకేతనము.

## పంచమాంకము.



### 1 వ రంగము.—పురవీథి.

ప్రవేశము—ఉదయాదిత్యుఁడును గంగాధరుఁడును.

గంగా—ఆర్యా! ఉదయాదిత్య మహానాయకా! ఉదయాదిత్యులగు మీరు సీతన్న యను పేరునను—గంగాధరుఁడనగు నేను గంగన్న యను పేరునను—గర్భశత్రుఁడగు కాలకేతుని గొల్చుటకన్న కష్టముగలదా!—అందును—నాకు భగవంతుఁడొసఁగిన బుద్ధి తేజమును తమకు మూఁగతనమునా! ప్రారబ్ధము!

ఉద—ఇందులకు—రాజనీతి సమ్మతించుచున్నది. నీవు మనస్థితిని విచారింపకుము. ఏమంటివేని—

సీ॥ అరిసి యుగంధరునంత మేధానిధి
నటియించఁడే మహోన్మత్తునట్లు
చాణక్యునంత ధీశాలి చచ్చినయట్లు
దాఁగఁడే యొక్క మందసమునందు
సుగ్రదాసంతతికి దుస్సాధ్య యోధుఁడు
గాసిలి మున్న సన్న్యాసిగాఁడె
రామాయమంత్రి శాత్రవమారణమునకై
యింటింట కోఁతి నాడింపలేదె!

ధీయుతుండగు ఖడ్గనారాయణుండు
మానవంతుడయ్యెను దా పఠాణిగాఁడె
ప్రభువులకు—రాజ్యతంత్రి మవశ్యమాట
కష్టకార్యంబు నా కిదిగాదు—హితుఁడ!—

అదిసరిగాని—మృగేశునిమూలమున పాషండునిచేఁజిక్కిన రత్న హారమును కాలకేతనునకు పట్టియిచ్చితిమిగదా! మనము మఱల మన మూకాంధవేషములతో సరియైన సాక్ష్యమునిచ్చుటకై కాలకేతనుని దరినుండవలదా?

గంగా—ఉండకున్న నెట్లు? కార్యము మఱియొకవిధమైన రూపము దాల్చదా?

ఉద—ఐన—నాలస్యమేల? పద!— (నిష్క్రమింతురు)

(తెర)

---

2 వ రంగము—కాలకేతనుని మందిరము.

ప్రవేశము—(కాలకేతనుఁడు హారమును పరిశీలించుచుండును—ప్రక్కన మూగ, గ్రుడ్డి వేషములతో సీతన్న గంగన్న—దూరమున పాషండుఁడు వినయముతో—)

గంగా—ప్రభూ! ఈహారమును—ఈతఁడు విక్రయమునకు దెచ్చినాఁడు. ఇట్టివి ప్రభువులగు తమవంటివారికడ నుండఁదగినవి.

సీత—(దీనివెల ఎనిమిదిరూపాయలని మూకాభినయము చేయును)

కాల—ఏమి? దీనివెల ఎనిమిదిరూపాయలా?—

సీత—ఆఁ—ఆఁ—(మూగకేకలు)

కాల—(పరిశీలించి) ఎక్కడిదిది? దీని నెవ్వఁడు తెచ్చెను?

సీత—(మూగసాజ్ఞచే పాషండుని చూపును.)

కాల—ఈహారము రెండువేలవిలువగల్గినది. మామంగళది. నాయంతః పురమునందలి రత్నహార మీదుష్టునిచేత నెట్లుపడెను? ఓరీ! రాజద్రవ్యాపహారణము చేసితివా? చోరుఁడా!

పాషం—ప్రభూ! తమవద్దనిఁక నిజముదాపను. నేనిది దొంగిలింపలేదు. కాని.........

కాల—కానియేమి? నీకిదియెవ్వరైన బహుమానముగా నిచ్చిరా?

పాషం—బహుమానముకాదు. బాకీక్రింద నీయఁబడినది.

కాల—నాయంతఃపురమున నీకు బాకీపడినవారెవ్వరు? నిజము చెప్పుము. అసత్యపరాయణా!

పాషం—నిజమే చెప్పుచున్నాను. ఆద్యంతము లాలకింపుఁడు. నేనొక పేరందిన జూదరిని. ఒకనాఁడు మృగేశుఁడనుజూదరి నాకు వేయి రూపాయ లోడిపోయినాఁడు. అధనమిప్పించెదనని నన్ను వెంటఁ బెట్టుకొని మంగళాదేవి అంతఃపురమునకుఁ దీసికొనివచ్చి—గుమ్మమున నన్ను నిలువఁబెట్టి—తాను లోనికిఁబోయెను. అప్పుడచ్చట నీలకంఠుఁడును—మంగళాదేవియు— ఏదో విషయ మాలోచించుచుండిరి. మృగేశుఁడు నీలకంఠుని వేయిరూపాయ లడిగెను. అందులకు నీలకంఠుఁడసమర్థుఁడుకాగా— మృగేశుఁ డాతని నిందింపఁగా—మంగళాదేవి నాయప్పుతీరుటకై మృగేశున కీరత్నహారము నిచ్చెను. మృగేశుఁడు నాకిచ్చెను.

కాల—(స్వగతము) నాభార్యయగు మంగళ—ఒకనీచ జీవునుకు—ముందఁపు బాకీకొఱకై —ఈహారము నిచ్చెనా? ఎంత యవమానము! ఎంత హేయకార్యము! నీలకంఠునకును—మృగేశునకును—ఇంతగొప్ప యాంతర్యముగలదా? కానీ చూచెదను. (ప్రకాశము) ఓరీ! జూదరీ! నీవు మాయంతఃపురమున నిది దొంగిలించితెచ్చి—నాతో నబద్ధము లాడెదవా? నిజముఁజెప్పకున్న—నేమిచేసెదనో చూడుఁడు.

పాపం—ప్రభూ! నేనెంత పాపండుఁడనైనను అనృతాలాపినిగాను. మీరు నన్ను చంపినను సరియే! ఇదినాకు లభించిన వాస్తవ మింతే!—

కాల—సరి! నీ ఋణము తీరినదా?

పాపం—ఏమితీరుట ప్రభూ! ఎవరికడకుఁ గొనిపోయినను దొంగసొమ్మని రాజద్రవ్యమని అనుమానించుచున్నారు. తుదకీ గ్రుడ్డివాఁడు ఎనిమిదిరూప్యముల నిచ్చెదనన్నాఁడు. చచ్చినవాని పెండ్లికి వచ్చినదే చాలునని కక్కుఱితిపడఁగా—ఈమూఁగవాఁడును గ్రుడ్డివాడును మీకుపట్టి—యప్పగించినారు.

సీతా—( అది 8 రూపాయలకన్న నధికకముగ ఖరీదుగలదికాదని మూఁగ సౌజ్ఞతోఁ దెలుపును.)

కాల—( నవ్వుచు నీవ్వూరకుండుమని వారించి ) ఓరీ ! నీవీ సందర్భమున నిజమే చెప్పితివని మేము విశ్వసించినారము. నీవు నష్టపడ నక్కఱలేదు. నీకు—వేయిరూపాయలను మేము మా ఖజానుండి యిప్పించెదము. అటు నిలువఁబడి యుండుము.

పాపం—ప్రభువువారికి పరిపూర్ణాయువు కలుగుఁగాక!—

కాల—నీలకంఠా! (హారమును దాచియుంచును)

నీల—(ప్రవేశించి) స్వామీ! ఏమి యానతి?

కాల—(నవ్వుచు) నీలకంఠా! చూడు; ఈ మూఁగవాండ్రు, గ్రుడ్డివాండ్రు, ఈ జూదరులు, త్రాగుబోతులు, అనృతాలాపులు, కృతఘ్నులు—నాచుట్టునుఁజేరి దానములకని, ధర్మములకని, నన్ను వ్రేపుకొని తినుచున్నారు. నాకు చేతనైనదేదో నేనిచ్చినను తృప్తిపడకున్నారు. నీవేమైన వీరిని సంతోషపెట్టఁగలవా?

నీల—ప్రభువువారు సమర్థులు. మావంటి బీదవారి కెక్కడనుండి వచ్చును.

కాల—ఏమి? ఇన్నినాళ్ళనుండియు రాజసేవచేయుచుంటివే! ఏమియును గణించి యుంచుకొనలేదా?

నీల—తమ రెఱుఁగని దాపరికము గలదా?

కాల—(వికటముగనవ్వి) ఔను—దాచుకొనుటకెక్కడిది? ఆగభాషి
చెప్పినట్లు—ఒంటెవలె సారాయితిత్తులను కడుపులో నిలువచేసి
కొనుటతోడనే—నీబ్రదుకు తెల్లవాఱుచున్నది. పోనిమ్ము.
ధనము లేకున్నమానె—ఏదైన రత్నహారముగలదేని ఈజూదరి
కైన దానముచేయుము. ఊరకలేదన్న నూరక వదలిపోవుదురా?
మనకు ఎప్పు డేజూదరితో నే పనియెందులకు గల్గునో!

నీల—జూదరులతో మనకేమిపని గల్గును?

కాల—(పెద్దగానవ్వి) ఓహో! నే నెఱుఁగననుకొంటివా?—ఇదివరకు
నాకేమి? నీకేమి?—ఎన్ని పనులో కల్గినవి. నీలకంఠా! నీకు రత్న
హారములు దానమిచ్చుటలో—మంచి చాకచక్యముగలదు
సుమా!—

నీల—నావద్ద రత్నహారములెక్కడివి?

కాల—నీవద్దనే యుండవలెననుమాటయేమి? నీసోదరి మంగళయుండ
లేదా? నన్ను బుట్టలోబెట్టి స్త్రీలోలుడగు నధమునిఁ జేసి సంపా
దించిన జవాహిరీ అంతింతయున్నదా? తృణప్రాయముగ నొక
రత్నహారము విసరి పారవేయలేదా? నీవెఱుఁగవా?

నీల—(వివర్ణుఁడై నాలుక కఱచుకొనును.)

కాల—(క్రోధముతో తలపంకించి వానిమొగము పరికించును)

నీల—ప్రభూ! తమరేమో నన్ను వృథావిమర్శ చేయుచున్నారు.

కాల—(పెద్దఁగా వెకలినవ్వు నవ్వి—వీపుపైఁదట్టి) అబ్బే! అనుమాన
పడితివా ఊరక పరిహాసమునకంటినిలే! నీలకంఠుడన్న రాజభక్తికి
మూలకందముగాదా! నాంబహిఃప్రాణము—పోనిమ్ము. ఈ
పాషండున కొక వేయిరూప్యములనీయ నాకు మనసగుచున్నది.
ఖజానాలోనుండి యిచ్చివంపెదవా?

నీల—(భయముతో) ఖజానాలో నిప్పుడు ధనములేదు ప్రభూ!

కాల—ఏమైనది?

నీల—ఏమో!

కాల—ఒకలక్షకుమీాఁటి యుండవలెనే?—

నీల—నేనెఱుఁగను. నిన్నధనాగారాధిపతి కొన్నివందలుమాత్రమే కల వని చెప్పెను—

కాల—(ఆగ్రహము నణఁచుకొని) సరి. నీలకంఠా! ఈధనాగారాప హర్తలుగూడ నెవ్వరో—నాకిదివఱకే తెలిసిపోయినది. త్వరలో వారి నాశనమును స్థిరపరచినాను—నీవు జాగ్రత్తగ నుండుము.

నీల—(భీతిల్లి) ప్రభూ! నేనేమి చేసితిని?

కాల—(నవ్వి) కాదోయి వెఱ్ఱివాఁడా! ఈలోన మోనగాండ్రు మోసగింతురు. "నీవు—జాగ్రత్తగనుండు" మంటిని. ఓరీ! పామండా! నీకు ప్రాణములతో వదలుటయే బహుమానము; పొమ్ము— నీలకంఠా! నీవును పొమ్ము—గంగన్నా! సీతన్నా! తరువాత పిలిపించెదను. పొండు—

(అందఱును వివిధభావములతో నిష్క్రమింతురు.)

కాల—(నీల॥ వంకఁజూచి పళ్లుకొఱికి) తొందఱపడకు—తొందరపడకు—రాజద్రోహపిశాచమా! తొందరపడకు—కాలకేతనుని కరవాలము నీ రక్తమాంసములకై వేగిరపడుచున్నది. (హారముతీసి) ఈ దుర్మార్గులకును దొంగ మృగేశునకును సంబంధమేమి?— ఏమి యీా నిగూఢప్రయత్నము!—ఇది యంతయు కాలకేతన వినాశ యత్నమేనా?— మందభాగ్య లోక[illegible]రుగి వచ్చి—యీా మహాగ్రహాగ్ని హోత్రమునఁగూలి మసియై పోవ నున్నారా?........సులోచనపై మంగళకుఁగల సవతిమాత్సర్యమే ఇన్ని దురాచరణములకు హేతువై యుండును. మృగేశునకును, పిరికీని ఆంతరంగిక సంబంధమే నిజముగ నున్నదో— సులోచనా శాంతికేతనులపైఁ గల్పింపఁబడిన ప్రవాదము లన్నియు నసత్యములు. జంకు గొంకు లేని మృగేశునిచేఁ జెప్పించి-నిర్దోషులను నాచేఁ జంపించి యుందురు. ఇదియే నిశ్చయము.

ఖజానాలోని ధనమును సయితమీ నీలకంఠ హంతకుఁడే మృగే శునకిచ్చి కారాగార విముక్తునిఁజేసి యుండును. అది గానలేక కారాగృహరక్షకు నురిదీయించితిని. కానిమ్ము. ఈపాపము నాది కాదు. ఈ నీలకంఠ చండాలునిదే!.........నీలకంఠా! నీకంఠ మును కాపాడుకొనుము. మంగళా! నీ యాయుష్కాలము తీరె నది. తొందరలేదు. సమయముచూచి నమ్మించి పీకగోంతులు గోయవలె!—

(అనుబంధము 11.) (నిష్క్రమించును.)

(తెర.)



3 వ రంగము—నీలకంఠుని మందిరము.

ప్రవేశము—నీలకంఠుఁడు.

(అనుబంధము. 12.)

నీల—(స్వగతము) ఎట్టి రహస్యభేదనమైనదో—ఎఱుఁగఁజాలనుగాని, నేను చేసినతంత్రమును మాత్రము—కాలకేతనుఁడు గ్రహించి నట్లు తోఁచుచున్నది. ఇతని కుటిలవాక్కులవలన ఏమిజరిగిన దియు—ఏమిగ్రహించినదియు సయితము బోధపడకున్నది. ఒక వేళ నిజము గ్రహించియే మాటలాడెనో లేక రహస్యమును వెడలఁగ్రక్కించుట కట్లాడెనో తెలియుటలేదు. ఎటుపోయినను ప్రమాదమే వీనియందు మెలకువఁగల్గి మెలంగవలసినదేకాని— నమ్మి ప్రవర్తింపరాదు. వీని యాస్థానమున నిఁక మంచికాలము తీరినది. సులోచనా శాంతికేతనులను మారణముచేసిన నాటి నుండియు ఈ రాజునకు మతి స్థిరముగనున్నట్లు తోఁపదు. వీని చేతులలో—నా కే క్షణమున చావుగలదో—ఈశ్వరేచ్ఛ...... జూందరిని నమ్మినందునఁగదా—రహస్యభంగమునకు సంశయింప వలసివచ్చెను. ఈసంగతి మృగేశు నడుగవలెను.

(తెరలో యుద్ధకోలాహలధ్వని)

ఓహో! అప్పుడే తుములంబగుయుద్ధ మారంభించినది. వలదన్నను వినక కాలకేతనుఁడు మంగళాద్యవరోధ కాంతలనుగూడ సంగరమునకుఁ గొనివచ్చినాఁడు. ఈమేధావి సంకల్పమేమో! శాత్రవులగు చాళుక్యులు కాంతాజనము నవమానింపరుగదా!—

(తెరలో) హా! నాథా! కాలకేతన రాజేంద్రా! హా! సోదరా! నీలకంఠా!—రక్షింపరండు.

(ఉలికిపడి) ఆఁ—ఏమి యీ విపరీతఘటనము? అనుకొన్నంతయును జరిగియుండునా? అది నాసోదరియగు మంగళ కంఠస్వరముకాదా?

(తెరలో) ప్రభూ! మంగళాదేవిగారిని శత్రువు లవమానపరచుచున్నారు. ఆలస్యము మహాప్రమాదకారణము.

(విని) ఓహో!—సందేహము నివృత్తి నందినది. సోదరీ! భీతిల్లకు—ఇదేవచ్చుచున్నాను— (వేగముగ నిష్క్రమించును.)

(తెర)



4 వ రంగము—యుద్ధభూమి, అంతట రణధ్వని.

ప్రవేశము—విఱచికట్టఁబడిన మంగళ.

(అనుబంధము. 13.)

మంగ—హా! మహారాజా! కాలకేతనా! కాలకేతనా! నీ సతీమణిని, నన్ను రక్షింపరమ్మ—

(తలపై దగిలిన గాయమునకు కట్టుగట్టుకొనిన కాలకేతనుఁడు-ప్రవేశము)

కాల—ఎవరిదీ యాక్రందనము?—

మంగ—ఓరాజేంద్రా! ఇటుచూఁడుము. నేను నీ దేవేరిని మంగళను చాళుక్యరాజులచే నిట్లు కట్టఁబడియుంటిని. రక్షింపుము. రక్షింపుము.

కాల—(దగ్గఱకువచ్చి తేరిపాఱఁజూచి) ఓసీ! కుటిలాత్మురాలా! నీవఁటే? చాళుక్యరాజులు నిన్ను బంధించిరా! (వికటముగ నవ్వి) మంచి పని చేసిరి.

మంగ—అయ్యయ్యో! ఏమి యీ బహిరంగమగు పరాభవము నాకు రాజేంద్రా! నిన్ను నిమ్మియున్న నన్నిట్లుపేక్షచేయుట నీకుఁ దగునా? నా బంధనములనైన విప్పింపక—ఊరక నిలువఁబడి పరిహసింపఁదగునా?

కాల—ఏమే! అనృతాలాపినీ! నీవు—నన్ను నమ్మియుంటివా? ఎఱుఁగుదును. ఏమనుకొంటివో!—నే నెఱుంగకపోలేదు. నాయందలి నీ నమ్మికయు, విశ్వాసమును, అంతయు నెఱుంగుదును. ఎఱిఁగియుండియే—వింటివా? మంగళా!—సర్వరహస్యములను కరతలామలకములనుగా నెఱిఁగియుండియే—నీ దురవస్థకు నవ్వుచుంటిని. వింటివా?—

మంగ—నేను నీయందేమి యవిశ్వాసము చూపితిని! సులోచనవలె జారిణినైతినా?—శాంతికేతనునివలె పితృద్రోహినైతినా?—

కాల—(మహాగ్రహముతో) హుం!—సులోచనా వినాశహేతు పిశాచినీ!—ఏమంటివే? సులోచన జారిణియా?—శాంతికేతనుఁడు పితృద్రోహియా? ఛీ! కలుషమతీ!—ఎంతపనిచేసి యెఱుఁగనట్లు మాటలాడుచుంటివే! పాపినీ!—కాలకేతనుని మొగమునకు మసిబూసి, వెట్టికోతినిజేసి, యాటలాడింత మనుకొంటివా?—మహాపతివ్రతవు—అమాయికవు—హంతకీ! దుష్టా! దురాశయా!

మంగ—నే నేమిచేసితినని యట్లు దూషింతువు?—పతివని నిమ్మికొలిచితినిగాని పగవాఁడవగుదువనుకొననైతిని. రక్షింతువనుకొని యాక్రందించితినిగాని—శిక్షించుతలంపున వచ్చితివనుకొననైతిని. ఛీ! నిన్ను నమ్మి— మానప్రాణములకుఁ బాసితిని.

కాల— హుం—చాలింపుము. చాలింపుము. నోరు కట్టుకొనుము.

(హారమును చూపి) ఇదియేమో చూచితివా?—

మంగ—(తెలతెలపోయి) అది నారత్నహారము! మీవద్దకెట్లు వచ్చెను!

కాల—ఎట్లువచ్చెనో యెఱుఁగవా?—మృగేశుని మఱచితివా?

మంగ—మృగేశుఁ డెవ్వఁడు?—

కాల—జూదరి—వాని జూదపుఋణముఁ దీర్పఁగోరి దీనిని లంచమిచ్చితివిగాదా పరోపకారపరాయణురాలవు—

మంగ—(స్వగతము) కటకటా! అన్నియు నీయనకు తెలిసిపోయినవి! ఇఁక బొంకిన లాభములేదు. (ప్రకా॥) క్షమింపుము. రక్షింపుము. పాపాత్మురాలనై సవతిమాత్సర్యమున, అబద్ధములాడించి సులోచనను చంపించితిని.

కాల—చంపించితివా?—నీవేనా?—

మంగ—ఔను. ప్రభూ!—

కాల—ఓసీ! స్త్రీరూపభూతమా! కాలకేతనునే వంచింపఁ గలిగితివా? కాలకేతనుఁడనిన—కాలయముఁడని యెఱుంగవుగా!

మంగ—పాపాత్మురాలను; ప్రభూ! రక్షింపుము—

కాల—పాపాత్మురాలవు గావుననే నిన్ను రక్షింపను—చంపెదను.

మంగ—అయ్యయ్యో! అయ్యయ్యో! ఏదిగతి?

కాల—మరణమేగతి—చాపుపాపినీ!— (పొడుచును)

(నీలకంఠుఁడు తటాలునఁ బ్రవేశించి మంగిళా వధముంగని తలతిరుగ—నిష్క్రమించును—అదిచూచి కాలకేతనుఁడు నవ్వుచుండును.)

(తెర.)

———

5 వ రంగము—నీలకంఠుని మందిరము.

ప్రవేశము—సురాపానముచేయు నీలకంఠుఁడు.

నీల—(స్వగతము) ఏమైనది? ఏమైనది? అంతయు వినాశమైనది. నేను హతమైపోయితిని నాయూహలన్నియు—సంకల్పస్వప్నములైనవి. నా యదృష్టచక్రమిప్పుడు వెనుకకుఁ దిరుగుచున్నది. నా యధికారము—నాపరాక్రమము-నాస్వతంత్రము-నాజయాభిలాష—నా తంత్రప్రయుక్తి-నిరాలంబములైనవి... ఈకాలకేతనుఁడు ఎందులకై నను మారణతంత్ర మొక్కటియే ప్రయోగించుచున్నాఁడే!—హా! సోదరీ! మంగళా! దుష్టకాలకేతన భూతమునకు నిన్నిచ్చి—వివాహముచేసి, యుసురు నేను దీసికొంటినే! సులోచన మరణముతో—నీమార్గకంటకము వదలిపోయెనని అపరిమితానందము నందితివిగాని—నీకు రానున్న దుర్మరణమును గుర్తింపలేకపోయితివిగదా! కటకటా! ఇంక నీవంటి సోదరి—నాకెందు లభించును! నా జీవితమిప్పు డేవంకఁజూచినను మహాంధకారబంధురమై తోఁచుచున్నది!— మనస్సు మిగుల కలఁతపడుచున్నది!—భూతావేశమైన చందమున శరీరమెల్ల మంటలు మండుచున్నది! అసహ్యము—మిగుల నసహ్యము—ఈప్రపంచకమంతయు మిగుల నసహ్యము!—కాలకేతన పిశాచము నన్ను వెంబడించి, చంప వచ్చునట్లున్నది. ఏవంకఁజూచినను భీభత్సతాండవంబగుచున్నది. (లేచి అటు నిటుఁ దిరుగుచు) ఇదియేమి పిశాచగృహము!—నరకలోక మింతకన్న—నానందప్రదముగ నుండునుగదా!—కాలకేతనా! ఓరీ! కాలకేతనా! నీపాపపరిపాలనమునకన్న—హిరణ్యకశ్యప రావణ కంసాదుల పరిపాలనము లానందకరములై యుండెనుగదా! (సారాయిత్రాగి) కైపు కష్టములను మఱపించునందురుగదా! ఇదియేమి?—ఎంతత్రాగినను కైపుచేయుటయేలేదు. ఇట్టి నా కీవిచార మింక తరుగుటయేమి?—ఇది తుదివిచారమే

కాబోలు. అబ్బా! భరింపజాల. భరింపజాల—కత్తితో పొడువఁ
బడిన మా మంగళ యాక్రందనధ్వని నాకు వినఁబడుచున్నది.
ఆ మంగళ భయంకరాకారము నాకన్నులకుఁ గనఁబడుచున్నది.
కన్నులు తెరువఁజాల!—(కన్నులుమూసి) అదిగో! అదిగో!
సులోచన—చచ్చియు నాసోదరిని సాధింపవచ్చినది. పో—పో—
సులోచనా పిశాచమా! నాదగ్గఱకురాకు; (కన్నులుతెరచితి
నిదానించి ఆకాశముం జూచి) ఆఁ—అదికారణము. ఇప్పుడు
బోధపడినది. తల్లీ!—నీవు శాంతరూపిణివి. నిన్ను నాశనము
చేయుటచేతనే—మా కీగతి గలిగినది! నాకిక కర్తవ్యమేమి?—
ఏమియునులేదు. నాశనమైపోయితిని.

(త్రాగి కూలబడి తూగుచుండును)

(ఉమాదిత్య గంగాధరులు, సీతన్న గంగన్న వేషములతో ప్రవేశము)

సీత—గంగాధరా! సులోచనాపిశాచమా యని ఇప్పుడు వినఁబడిన కేక
నీవు వింటివా?

గంగా—వింటిని. అది నీలకంఠుని వెఱ్ఱికేక!

సీత—సరి, వీఁడిప్పుడు త్రాగి మంచికైపుమీఁద నున్నాఁడు.

గంగా—మనలను గుర్తించునేమో—మీరు మూకాభినయము నవలం
బింపుఁడు—నేను గ్రుడ్డితనము నటింతును.

సీత—వెఱ్ఱివాఁడా! వీఁ డిప్పు డేలోకమున నున్నాఁడో వీనికి తెలియు
ననుకొంటివా? ఎట్లు తూలుచున్నాఁడో చూఁడు. వీనిచుట్టు నొక
యామడదూరముదనుక సారాయికంపు కొట్టుచున్నది. ఆహా!
మధుపానమహిమ!

సీ॥ వసఁ దిన్న చిల్కకై వడి నసందర్భపు
నూహల వదరించు నొక్కమాటు
కర్ణాదులనుమీఱఁ గనబడ్డ దెల్ల న
న్యులకు నిప్పించు నింకొక్కమాటు

వెఱ్ఱిగాడిదను గావించి బూడిదలోన
నూరక పొరలించు నొక్కమాటు
చెల్లెనైనను కన్నతల్లినైనను గూడ
నూహఁగల్పించు వేఱొక్కమాటు
చెలఁగి బూతులు దిట్టించి చెప్పుదెబ్బ
లొకనిచేఁ దినిపించు; నింకొక్కమాటు
ఊర కేడ్పించు నవ్వించు నొక్కమాటు
మధురసం బెంత ఘనునైన నధముఁజేయు॥ ౨౮

రమ్మన్న—వీనిని ప్రేరిలించుట కిది మంచిసమయము. ఇది వీని యధః పతనమునకే వచ్చినది.

(ఇద్దఱునువచ్చి దగ్గఱఁగూరుచుందురు.)

నీల—(తలయెత్తకయే తూగుచు) నాశౌర్యము—నాపరాక్రమము— నాసహాయములేక—చిన్నమెత్తు భూమిగాని—చిల్లిగవ్వధనముగాని లేని కాలకేతనునకా యింతపోతరము! నాకు నిజముగ ఆగ్రహము వచ్చిననాడు—వీనిపనియేమి కావలసినది. కుటిలుఁడు కుతంత్రపరాయణుఁడు—దుష్టుఁడు—దుర్మార్గుఁడు—ఎంతసాహస మెంత సాహసము!

సీత—(వీపుపై తట్టి) నీలకంఠా! ఏమో నీలో నీ వనుకొనుచుంటివే!

నీల—రా! వచ్చికూరుచో! శివకుమారా! ఈ రెండవవాఁడెవఁడు?

సీత—అంత తెలివితేటలలో నున్నాఁడన్న మాట!

నీల—ఓస్! అప్పుడే చింకితాటాకులు కట్టుచున్నావా? ఒక్కబుడ్డితో డనే యులటాయగుటకు—పనికిమాలిన పైత్యశరీరిననుకొంటివా? వీఁడు మన వీరనారాయణుఁడు—ఆపాటి గ్రహింపలేనా?

గంగా—ఓ! మంచితెలివిలోనుంటివి. కాకున్న నింతవేగిరముగ శివకుమారుని—వీరనారాయణుని గుర్తింపఁగలవా?—

నీల—ఆఁ—ఆఁ—అద్దీమాట! నీబొడ్డుపొక్క!—నీ వసాధ్యుఁడవురా!

సీత—సరేగాని, నీలకంఠా! కాలకేతనుని పేరెత్తుచుంటి వది యేమి?

నీల—కాదురా! నారాయణా! ఈనీలకంఠుఁడు లేకున్న కాలకేతనునకు గతియున్నదఁటరా!

సీత—నిజముచెప్పితివి! నీసహాయముననేకదా—వాఁడింతవాఁడయ్యెను. వాని కా కృతజ్ఞతయుండదా?

నీల—కృతజ్ఞతయా? ఉండుండు—(మరల సురారసముత్రాగి) కృతజ్ఞత గలవాఁడైన నాచెల్లెలిని చంపునా?

గంగా—ఔను. కాలకేతనుఁడు కృతఘ్నుఁడే!

నీల—ఇంకొక పెద్దరహస్యమున్నది నిజముగ నీలకంఠుఁడే వీనిని మోసముజేయ సంకల్పించెనా—కనిపెట్టగల గడుసుదనమొక్కనికైనఁ గలదఁటరా?

సీత—నీ వట్లుచేయవుగాని చేసిన నాటంకమేమిరా?

నీల—చేసితినోయి వెఱ్ఱిపీనుగరాయఁడా! చేసితిని—నీవొక అభాజనుఁడవు—కాలకేతనుని గుడ్డివానినిచేసితిని. వానికన్నులకు గంతలు గట్టితిని. పట్టపగలు కన్నమువేసితిని. కనిపెట్టఁగలిగినాఁడా? ఏమి మాటాడవు! కనిపెట్టఁగలిగినాఁడా? హేహేహేహేహేహేహే- (వెకలినవ్వు నవ్వును)

సీత—మొత్తముమీఁద నీవ్రూరకుండలేదనిన మాటయే! అసాధ్యుఁడవోయి నీలకంఠా!

నీల—హేం! హేం! హేం! హేం! అసాధ్యుఁడనని మెల్లఁగా ననుచుంటివా? ఓరీ! పారాయణా!......హేహేహే!—కాదు—వీరాయణా!—కాదు; కాదు—సారాయణా!......(విసుగుతో) ఊఁ—ఎవ్వఁడవోయొకఁడవు—నీవు......నీవు మాటాడవేమి? నే నసాధ్యుఁడనేనా?

గంగా—వట్టియసాధ్యుఁడవు మాత్రమేనా? మహామహాసాధ్యుఁడవు.

నీల—ఆఁ—అద్దీమాట!—నీబొడ్డుపొక్క! నీవురా నామనస్సునకు నచ్చి నవాఁడవు.

సీత—నీ వసాధ్యుఁడవని వేఱే చెప్పవలెనా? నీమాటలే సాక్ష్యములు.

నీల—(వెకలినవ్వు నవ్వి—వ్రేలుచూపి బెదరించి) హహ్హహ్హహ్హ! అద్దీ! అద్దీ!! నీవు నన్ను పరిహాసముచేయుచుంటివి. ఏదో—కొంచెము చలనపదార్థము పుచ్చుకొంటినిలే!—

సీత—(సురారసము నందించును)

నీల—(త్రాగి మీసముత్రిప్పుచు) హుఁ—మట్టిబుర్ర నీలకంఠుఁడఁట! వాని బుర్ర చిదుకఁ గొట్టెదను.

గంగా—ఓ! తప్పక కొట్టవలసినదే! అప్పుడు పిలువు. నేనును సాయము వత్తును.

సీత—ఇంతకును నీ వెట్లు కాలకేతనుని కన్నులకు గంతలు గట్టితివో చెప్ప లేదు.

నీల—నీ తెలివి కాల! ఇంతేనా? నా శక్తి—నా పరాక్రమము—హుం—ఏమనుకొంటివి? మృగేశునిచే దొంగసాక్ష్యము చెప్పించి, కత్తిని విసరింపఁజేసి, శాంతికేతనుని సొంతముచేసి—సులోచనకు శుద్ధ మోక్షమిచ్చితిని. ఖజానాలోని లక్షరూపాయలు మృగేశున కిచ్చి—చెరనుండి విడుదలచేసితిని. కనిపెట్టెనా కాలకేతనుఁడు! హే! హే! హే!—

సీత—అబ్బా! ఈ పనులుచేసినది నీవేనా?—

గంగా—ఎంతయద్భుతము! నీలకంఠుఁడన్న నేమో యనుకొంటిని.

నీల—(నిషాచే తూలుచు) ఏమో యనుకొంటివా? ఏమో......ఏమో యనగా నర్థమేమి? నీబుర్రకాయా? ఏమో యనుకొన్నాఁడట! హేహేహే!

సీత—ఇదిగో! నీలకంఠా! ఇటుచూడు.

నీల—(మాటాడక తూలును)

సీత—నీలకంఠా! నీలకంఠా!

నీల—(మాటాడక చేయి విసరును)
సీత—సరే! ఐనది—ఇఁక పరుండుము.
నీల—(పరుండును.)
సీత—గంగాధరా! వీనినాశనమునకీనోటివట్టము చాలును. రమ్ము—
ఇది కాలకేతనున కెఱిఁగింతము.
గంగా—కాలకేతనుఁడు మనలను గుర్తింపఁడుగదా!
సీత—నీవు గ్రుడ్డివాఁడవు; నేను మూఁగవాఁడను. అందాతని విశ్వాసము నకుఁ బాత్రులము. నీవు చూడఁగల్గినపుడును, నేను మాటాడఁ గల్గినపుడునేకాని, ఈలోపల మనకాభీతిలేదు; రమ్ము పోదము—
(ఇరువురును నిష్క్రమింతురు)

(తెర)

•••○O○•••

6వ రంగము—కాలకేతనుని మందిరము

ప్రవేశము—కాలకేతనుఁడు, మూఁగ, గ్రుడ్డివేషములతో ఉదయాదిత్యుఁడు, గంగాధరుఁడు.

కాల—గంగన్నా! ఇప్పుడు మీరు చెప్పినదంతయును నిజమా? ఆదుష్టుని పిలిచి యడుగుదునా?
గంగా—అడుగవచ్చునుగాని, ఎంతయు క్తిగా నడిగి నిజముఁగ్రక్కింతురో!
కాల—అది నేనెఱుంగుదును......సీతన్నా! నీలకంఠునిఁ బిలుచుకొని రమ్ము.
సీత—(నిష్క్రమించును.)
కాల—గంగన్నా! ఈకపటాత్ముని వంచనమున మతిచెడి యెంతభ్రష్టుఁ డనైతినోయి!

సీ॥ ఆగభాషిని మించినట్టి భృత్యుఁడు నాకు
కలుగునే కోటిజన్మలకునైన

క్షితిని సులోచనాసతివంటి సతి నాకు
సమరునే జన్మాంతరమున నైన
శాంతికేతన సమానంత సద్గుణరాసి
ప్రాప్తించునే మఱెప్పటికినైన
గడచిన యానందకరజీవనంబు నా
కింక లభించునే యెన్నడైన
కాలకేతను నట్టి దుష్కర్ముఁడింక
నేయుగంబుననేని జనింపఁగలఁడె?
పోయె నాజీవనాటక పూర్వభాగ
మింక నా కాలకేతనుం డిపుడు లేఁడు॥ ౭౯

(సీత॥ నీలకంఠుడు ప్రవేశము.)

నీల—ఏమిసెలవు?—ప్రభూ!

కాల—కూర్చుండుము. నీలకంఠా! నే నన్నివిధములఁ జెడిపోయితిని. తుద కిప్పుడు నిన్నాశ్రయింపవలయునని పిలిచితిని.

నీల—(స్వగ॥) ఓహో! మొదఁటిమాటతోడనే గుండెలలో పెద్దబాయి పడినది. ఈ యతివినయపోగ మీతని నావహించినప్పుడెల్ల— నేదోయొక భీకరకృత్యము జరుగుచునేయుండును. నేడు నాప్రాణములమీఁదికి వచ్చినది. సందేహము లేదు.

కాల—ఏమి? మిత్రమా! నీలకంఠా! మాటాడవు? నీకు నాపై నాగ్రహమువచ్చినదా? ఇట్లాగ్రహించినచో—నేను బ్రదుకఁగలనా? నీసహాయము లేకున్నచో నాకు చిన్నమెత్తు భూమిగాని చిల్లి, గవ్వ ధనముగాని కలదా? — నేను కన్నులు మూసికొని గుడ్డిపందవలెనుండఁగా—నన్నుద్ధరించినది నీవుగాదా? ఇటు చూడుము. అదిగో! అంత కోపముతోనున్నచో—నెట్లు బ్రదుకఁ గలనని చెప్పితినిగాదా? నాచేత నిప్పు డొక్కగవ్వయైనలేదు. ఖజానానుండి యెవ్వఁడో కుటిలాత్ముఁడు లక్షరూప్యముల నప

హరించెను—ఇఁక నాకేమిగతియున్నది? నీవేగతి. ఒకలక్షరూప్యముల ధనము నిచ్చితివా బ్రదికెదను. నీమేలు మఱచిపోను; వింటివా?

నీల—ప్రభూ! తమ రిట్లనుటతగునా? నే నంతపెద్దజేయఁదగినవాఁడనా? నావద్ద లక్షరూప్యములున్న—నే నిట్లేల యుందును?

కాల—కాదు. అట్లనఁగూడదు. ఇట్టివిషమకాలమున నీవు రక్షింపకున్న నాకు దిక్కెవ్వరున్నారు?—నిన్ను నమ్మి కొడుకు గ్రుడ్లు దీయించి చంపితిని. భార్యను చంపుకొంటిని. అగభాషిని చంపితిని. అనేక సైనికులను చంపి, ఆ కపాలములతో స్థూపములు గట్టించితిని. నీవుగూడ నన్నన్యాయము చేయుదువా?

నీల—ప్రభూ! తమమాటలు నాకు విస్మయము గలుగఁజేయుచున్నవి. నేనేమి? లక్షరూపాయల నీయఁగల్గుటేమి?—

కాల—ఆఁ—ఏమిమాటాడితివి? నాకు సహాయముచేయుట కిష్టములేదని స్పష్టముగఁ జెప్పరాదా? నీవంత చేతగానివాఁడవా? నీవులేకున్న నాకు చిన్నమెత్తుభూమిగాని, చిల్లిగవ్వంత ధనముగాని లేదు గదా! ఎందులకు బొంకెదవు? ఒడ లెఱుంగవా?

నీల—ప్రభూ! నిర్దోషినగు నన్నిట్లు తర్జన భర్జనములుచేసిన నేనేమి చెప్పఁగలను?

కాల—నీవు నిర్దోషివా? ఔను. నిర్దోషివే కావచ్చును. కావచ్చును. నీ దోషాదోషములతో నాకు పనిలేదు. మృగేశున కిచ్చిన లక్షరూపాయలైనఁ దెచ్చియిచ్చెదవా?

నీల—నేనేమి యెఱుఁగుదును?

కాల—పోనిమ్ము. ఆ లక్షరూపాయలలో—మీరిద్దఱును గలసి చెడ తాగఁగా మిగిలిన ధనమైనఁ దెచ్చియిమ్ము. చాలును.

నీల—మహాప్రభూ! ఎందులకీ నిష్ఠురములు?

కాల—(నీలకంఠుని గొంతుపిసుకుచు) రాజద్రోహపిశాచమా! ఏమిరా పల్కుచుంటివి? నిజము చెప్పుము. నీగొంతు కోసెదను.

నీల—అయ్యయ్యో! మహారాజా! నన్ను చంపకుము.

కాల—చంపక వదలను. ప్రాణములపై నింక భ్రాంతి మానుము. నిన్న నేమి వదరితివో చెప్పుము. అనృతము లాడిన నాలుక గోసెదను.

నీల—(స్వగ॥) హా! హా! తెగతాగ్రి ఎవ్వనితోడనో నిన్న వదరినమాట లీతని చెవినిబడినవి. ఇక నిజము నొప్పుకొని కాళ్లఁబడకున్న చంపఁగలఁడు.

కాల—ఏమిరా మాటాడవు భూతమా!

నీల—మహారాజా! ఇంకేమిచెప్పుదును? నాపాపము నేటితో బ్రద్దలైనది. ఎంత కుటిలకర్ముఁడనై బ్రదికితినో తుదకు హర్యక్ష భీకర కరాళమునంబడి మరణింపనుంటిని.

కాల—నీ పగలమాట లింక నాకడసాగిరావు. నిజము నొప్పుకొనినంత నే-రక్షింతునని తలంచితివి కాఁబోలును. అందిన జుట్టును అందకున్న కాళ్లునా? నిన్నుఁ జంపినగాని నా యాగ్రహాగ్రహమునకు శాంతి లేదు. (చంపఁబోయి ఆకాశమునం జూచి) ఆగభాషీ! ఆగభాషీ! సులోచనా! రూపలీ! నన్ను వారించుచుంటిరా?—ఇంకమీఁద హత్యలు సేయవలదనుచుంటిరా? ఆగ్రహింపకుఁడు. మీయాజ్ఞలకు విధేయుఁడను. (కత్తి పారవేయును.)

గంగా—మహారాజా! ఇదియేమి? ఉన్మత్తులైతిరా?

కాల—గంగన్నా! నామనస్సునకు ప్రచండాఘాతమైనది. నన్నేమియు బలుకరింపకుఁడు. ఓరీ నీలకంఠశునకమా! నేటికి బ్రదికితివి. సాయంత్రములోపల నా లక్షురూపాయలు తెచ్చి క్రక్కకున్న నీచావు తప్పదు. కాచుకొమ్ము. గంగన్నా! సీతన్నా! రండు—

(ముగ్గురు నిష్క్రమింతురు.)

(అనుబంధము. 14.)

నీల—అకటా! నాకెంత పరాభవము! మృత్యులోక ముఖద్వారమునకు బోయి మఱలివచ్చితినిగదా! ఎంతకాఠిన్యముంజూపి ఎన్నిదూషణములాడి, ఎట్టి నీచావస్థకుఁ బాల్పరచె నీకాలకేతనుఁడు.

గీ॥ సోదరినిఁజంపె—నన్నిట్లు శుంఠఁజేసె;
పాదతాడితుఁజేసి చంపఁగదలంచె
కాలకేతననామకాకాలమృత్యు
గహ్వరంబునఁ బడితి నే గతులు గలవో!— 30

(సీత॥ గంగ॥ ధనవుమూటతో ప్రవేశము.)

గంగా—నీలకంఠా!
నీల—మిత్రులారా! నాగతి యిట్లయినది. చూచితిరిగదా!
సీత—ఎవ్వనితో నేమనిప్రేలితివో—నోటివట్టము ప్రాణగోడ్డమైనది.
నీల—(ఆశ్చర్యముతో) సీతన్నా! నీవు మాటలాడఁగలవా?
గంగా—అతఁడు మాటాడఁగలఁడు. నేను చూడఁగలను.
నీల—అట్లయిన వేషధారులైన మీరెవ్వరు?
సీత—నీవే గుర్తింపుము. (నిజరూపముల దాల్తురు)
నీల—ఆహాహా! ఏమియాశ్చర్య మేమియాశ్చర్యము? చాళుక్యవీరు
లగు ఉదయాదిత్య, గంగాధరులా? సుంతైన గుర్తింపఁజాలక
పోయితినే!
సీత—దానికేమిగాని, నీవీ కుటిలునినమ్మి యిట్లయితివిగదా! ఇప్పుడు
నీభావియత్న మేమి?
నీల—మహాత్ములారా! నాకింక మీపాదములే శరణ్యము. నన్ను
రక్షించి మీలోఁ జేర్చుకొనుఁడు. ఈయమధర్మరాజు కోఱల
నుండి కాపాడుఁడు.
సీత—కాపాడుటకే వచ్చితిమి. కాని కాలకేతనుని కడనున్నపుడువలెనే
కపటతంత్రములు నాకడ గూడ నల్లితివా కాలకేతనునివలె నీప్రా
ణములను వదలువాఁడఁగానని యెఱుంగుము.
నీల—మహాత్మా! ఇప్పటికైన ప్రాయశ్చిత్త మీ బ్రదుకునకుఁజాలదా?
సీత—సరే! అట్లైన ఇవిగో లక్షరూప్యములు. వీనిని తొలుత కాలకేత
నున కిచ్చిరమ్ము. మేము వేషములు మార్చితిమి. వానిమెదుటఁ

బడరాదు. మా రహస్యములను వానికిఁజెప్పి ఇప్పుడే మోసమున
కొడిగట్టితివా-ఇదిగో చూడు— (తుపాకిచూపును)

నీల—మీ కాసందేహ మక్కఱలేదు. క్షణములోవచ్చి కలసికొందును.
(నిష్క్రమించును)

(తెర)

పంచమాంకము.



# కాలకేతనము

## షష్ఠాంకము.



### 1 వ రంగము—అరణ్యమార్గము.

ప్రవేశము—మృగేశుఁడు; మణికుండల.

మణి—అయ్యో! నా పతి కేమో యాపదగలిగెనని నన్నిందుఁ గొనివచ్చితివి. ఎక్కడనున్నారు నాపతి యుదయాదిత్యమహారాజు?

మృగే—నీ పతియేనా! చూపెదనురమ్ము. మఱికొంత యరణ్యమార్గమునకు రమ్ము చూపెదను.

మణి—నేను రాను. నీప్రవర్తనము నాకు సందేహాస్పదముగనున్నది. నీవెవ్వఁడవు.

మృగే—నేనా? మృగేశుఁడను.

మణి—అనఁగా—నాకర్థముకాలేదు.

మృగే—హాహ్హాహ్హాహ్హా! మృగేశునిపేరు నీవు విననేలేదా? మూఁడులోకములు మృగేశునిపేరు విన్న గడగడలాడిపోవునే! వినలేదా?

మణి—నీవు హంతకుఁడవా? జారుఁడవా? చోరుఁడవా?—

మృగే—ఏదియనుకొన్న నదియే; కాని—ప్రస్తుతపరిస్థితి ననుసరించి నేను—చోరుఁడను మాత్రమే!—

మణి—ఓరీ! కుటిలవర్తనా! నన్నేమనుకొంటివి? మోసగించి యాప్తునివలె నమ్మించి యరణ్యమునకుఁ గొనివచ్చి—అక్రమము సేయ నెంచితివా?—

మృగే—నావద్ద నీవిన్ని మాటలు చదువవద్దు. తెలిసినదా? నా కీదిన మున త్రాగుటకుఁగాని—జూదమునకుగాని—ధనముదొరుకలేదు. దొంగిలించుటకు వచ్చితిని. మితిమీఱి మాటలాడితివా నీ చావుగూడ నిశ్చయమే యగును.

మణి—ఛీ! దురాత్మా! నన్ను నీవు తాకఁగలవా? చూడుము ఇదే కటారి. సమీపించిన చావఁగలఁవు. (కత్తిజూపును)

మృగే—ఏమేమీ? నన్ను చంపుటకై కత్తిఁదెచ్చితివా? ఆఁడుదానిచేతి కత్తినిఁజూచి యడలుదునా? అంత పాపకాలమా?—

మణి—రాకు; దగ్గఱకురాకు. చెడెదవు. నీమరణము సమీపించినది. జాగ్రత్త!

మృగే—(తటాలున కత్తిని లాగుకొని) ఛీ! తులువా! ఇప్పుడేమిచేసెదవో చేయుము. నీమెడలోని యాభరణములను బలవంతముగఁ ద్రెంచుకొని పోయెదను.

(త్రెంచుచున్నాఁడు.)

మణి—హా! దైవమా! రక్షింపుము—

(గంగాధరుఁడు ప్రవేశించి తుపాకిప్రేల్చును. మృగేశుఁడుపారిపోవును.)

గంగా—ఓరోరి మానినీమానభంగమహాపాతకవర్తీ!—

చ॥ నిలుమిఁక నెందుబోయెదవు? నీచుఁడ! కాలము దీఱె నీకు; గాల్కొలదినిఁ బాఱఁజూచెదవె? ఘోరశరాహతి నిన్నుఁగూల్చి యీ
లలనను మాతృసన్నిభను లాగి-బలాత్కృతి సల్పినట్టి-నీ
కలుషఫలంబు నీతలనుఁ గట్టకమానను మానవాధవా!— 30

(వెంబడించును.)

మణి—(స్వగతము) కటకటా! ఎంత ప్రమాదము గలుగవలసినది. అమాత్యగంగాధరులు సమయమునకురాకున్న నెంతపని జరిగియుండును! తెలివిమాలి యీనీచుని వెంబడించినచ్చితినే! మహారాజిందుల కేమనుకొనునో!

గంగా—(ప్రవేశము.) అమ్మా! మణికుండలాదేవీ! వాఁడు నాచేతికి దొరుకకుండ లేడిపిల్లవలె పారిపోయెను. మీ రిందేలవచ్చితిరి?

మణి—మహారాజు ప్రాణాసన్నస్థితియందున్నవా రనియు నన్నుచూడఁ గోరినారనియు—నమ్మబల్కి వీఁడు నన్నిందుఁదెచ్చెను.

గంగా—భగవదనుగ్రహమున నిప్పటికి ప్రమాదముగలుగలేదు. ఇంటికి రండు— (ఇరువురును నిష్క్రమింతురు॥)

(తెర)



2 వ రంగము—శ్మశానవాటిక.

ప్రవేశము—మృగేశుఁడు (గాయముతో)

మృగే—(స్వగతము) హా! హా! ఇదియేమి భయంకరము! మహాపతివ్రతయును ఉదయాదిత్యకళత్రమునునగు మణికుండల కంఠహారముం దెంపఁగా నందలి ముత్యములు వృశ్చికములవలె నన్నుఁ గఱచుచున్నవి. తగిలిన గాయఁపు విచారమట్లుండఁగా—చేసిన దుష్కార్యమున కధికవిచారము గల్గుచున్నది. తుదకు నేను—భీకరమైన శ్మశానప్రాంతమునకే వచ్చితినే!—ఎంత భీభత్సముగ నున్నది! అంధకారమైనందున దిశలు సయితము తెలియుటలేదు! నేనిప్పు డెక్కడకు బోఁగలను! కొరవిదయ్యములుకాఁబోలును భీకరముగ తాండవముసేయుచున్నవి. ఆకాశము మేఘాచ్ఛన్నమై—వర్షధారాపాతముసయితమారంభించినది. ఇచ్చట నేదో వృక్షమువలె నున్నది. దీని నీడయందు విశ్రమించెదఁగాక!

(కూర్చుండగా భూతసందర్శనమగును)

మృగే—ఓభూతరాజా! నన్నుచంపకుము. చంపకుము. నేను పాపాత్ముఁడనే! కాని, నీయందుమాత్రము నిరపరాధిని. రక్షింపుము.

భూత—పుత్రకా! భీతి నందకుము. నేను నీకపకారముసేయుటకు రాలేదు.

మృగే—భూతమా! నేను నీకు పుత్రుండ నెట్లగుదును?

భూత—చిన్ననాడ యిల్లువదలి తుంటరివై—దేశములుదిరుగ నారంభించి త్రాగుబోతువై—జూదరివై—జారుండవై—చోరుండవై యున్న నీకు నీతండ్రి జ్ఞప్తికిరాండు నిజమే; నేను నీతండ్రినైన రూపచందును. నీసోదరియగు రూపలిని దుర్మార్గుండగు కాలకేతనుండు సిలువపై నురిదీసెను. అనాథులమై మేమిరువురమును గతిలేని మృతింగాంచితిమి. మా మనఃక్షోభమునకు ప్రతీకారము సల్పినవారు లేరు. మా దుఃఖము నాలకించినవారు లేరు. రక్తముం గ్రక్కుచు నేనీప్రదేశమునందే మరణించితిని. అల్లదే మనరూపలి చర్మాస్థిక లాసిలువపై నిప్పటికిని వ్రేలాడుచున్నవి చూడుము. అకాలమరణమునొందినవాండనగుట నేనిందు పిశాచమనై తిరుగుచుంటిని. నీసోదరి యొకపెనుభూతమై కాలకేతనుని నాశనమును కాంక్షించుచు, వానిని వెంటాడుచున్నది. నీవు చాళుక్య నాయకుండగు ఉదయాదిత్యుని యనుగ్రహమునొంది యాతని సహాయమున కాలకేతనుని చంపితివేని మా కీపిశాచరూపములు తొలంగును పొమ్ము. పొమ్ము. (అదృశ్యమగును)

మృగే—మహాభయంకరము; మహాభయంకరము. నాశరీరము కంపించుచున్నది. నాప్రాణము రివ్వున నెగసిపోవుచున్నది. నాతండ్రియు నాసోదరియు పిశాచములై తిరుగుచుండిరా? కాలకేతన చండాలుండిట్లు నాకుటుంబనాశనము చేసినాండా? నేను వ్యర్థుండనై పోయితినా? ఓరీ! కాలకేతనా! నీ కాల మింక సమీపించినది. నీవింక బ్రిదుకవు. (నిష్క్రమించును.)

(తెర)



3 వ రంగము—ఉదయాదిత్యుని నిలయము.

ప్రవేశము—ఉదయాదిత్యుఁడు, నీలకంఠుఁడు.

ఉద—నీలకంఠా!

గీ॥ కాలకేతనుని యదృష్టకర్మబలిమి
చెల్లె నిన్నినాళ్లాతని చేతలెల్ల;
నింక విధితారుమారౌటయే నిజంబు
కర్మమింకనైన బ్రద్దలుగాకపోదు. 3౨

నీల—ఉదయాదిత్య మహారాజా! కాలకేతనుని సైన్యములతోఁపాటుగా రాష్ట్రీయజనమఖిలంబును మనపక్షమైనట్లానంద కోలాహలము చేయుచున్నారు. మనమింక జైత్రయాత్రాసముద్యోగము సేయవచ్చును.

ఉద—గంగాధరామాత్యుఁడు కానరాఁడే?

నీల—ఎవ్వఁడోయొకఁడు మనవంకకు వచ్చుచున్నాఁడు.

(మృగేశుఁడు ప్రవేశము.)

మృగే—ఉదయాదిత్య మహారాజా! నా కభయమిమ్ము. నన్ను నాపితౄణముం దీర్చుకొననిమ్ము. (పాదములపైఁబడును.)

ఉద—ఓయార్తుఁడా! లెమ్ము—నీవెవ్వఁడవు?

మృగే—అయ్యా! నేను మృగేశుఁడనువాఁడను. కాలకేతనునిపైఁ గ్రోధముపెంపున వానిని సంహరింప నీసహాయముం గోరివచ్చితిని. నా చేతి కొక కరవాలము నిమ్ము. ఆలసింపకుము.

ఉద—ఓ యాగంతుకుఁడా! ఇదిగో కరవాలము గైకొనుము. (ఇచ్చును.)

మృగే—(గైకొని) ధన్యుఁడను రాజేంద్రా! ధన్యుఁడను.

నీల—(స్వగ) ఈదొంగ నాశత్రునిజంపవచ్చుట నాకానందకరమే కాని వీఁడు—వీరికడ నారహస్యములను వెల్లడింపఁడుగదా!

(గంగాధరుఁడు ప్రవేశము.)

గంగా—ప్రభూ! వందనములు. నేఁడొకప్రమాదము......(మృగేశు నిఁజూచి) ఏమిది? ఈచోరుఁడు మరల నేదోద్రోహమొనర్ప నిందు వచ్చెను?

ఉద—వీఁడొనర్చిన ద్రోహమేమి?

గంగా—సామాన్యద్రోహమా? తమయర్ధాంగియగు మణికుండలాదేవిని వీఁడు పరాభవింప సమకట్టగా—సమయమునకు నేనట కరిగి—తుపాకితోఁగొట్టఁగా పలాయితుఁడై మఱల నేదోతంత్రముం బన్ని యిందువచ్చెను.

ఉద—ఓరీ! దుష్టా! ఏమిరా నీచమైనపనికి సాహసించితివి!

మృగే—అయ్యా! క్షమింపుఁడు. దేవిగారి నెఱుంగక ధనాశచే......

గంగా—ఇంకను నిన్ను క్షమింపవలయునఁటరా! పాపాత్ముఁడా! నీవంటి లోకద్రోహి జీవించియుండరాదు. మరణింపుము.

(పొడుచును)

మృగే—(క్రిందఁబడి కొట్టుకొనుచు) హా! హా!!—ఉదయాదిత్యా!—ఎంతపనిచేయించితివి?—నన్ను నమ్మియుండిన నీకెంతసహాయము జరిగియుండెడిది!—ఓరీ! నీలకంఠా! సమీపమునందుండియు వారింపలేకపోయితివా?

నీల—ప్రమాదకరుఁడవైన చోరుఁడవు నీవు! నీకిట్టిగతి యవశ్యము జరుగదగినదే.

మృగే—ఏమంటివిరా కృతఘ్నుఁడా!—నా కెట్టిగతియో నీకు నయిత మట్టి గతియే కలుగఁదగినదిగాదా! మనము తోడుదొంగలము. మఱచితివా!

నీల—ఛీ! వదరకు; అనృతాలాపీ! నీమాటల నెవ్వరు నమ్మెదరు?

మృగే—(కోపముతో) నాయెదుటనేనా నీ సాహసము! నీమూలమున గాదా నేను పాపముచేసితిని. నీమాటవిని యడ్డమైన యనృతము లాడి సులోచనా శాంతికేతనులఁ జంపించితి. పాపాత్ముఁడా!

సీల—నాలోఁజేరి కాలకేతనుని వంచించిన నీవు కాలకేతనునిలోఁజేరి మమ్ము వంచింపకుందువా? నీకిట్టి మరణమే సరి.

మృగే—ఓరీ! రాజద్రోహీ! ఈ మహారాజు జ్ఞానహీనుఁడై నిన్ను జేర్చెనుగాని కాలకేతనుని మోసగించిన నిన్ను నమ్మనచ్చునా? విషసర్పమా! నీకుమాత్ర మింతకన్న హీనమరణము గల్గకుండునా?

సీల—నాకేల హీనమరణము గల్గునురా?

మృగే—ఏలకల్గునా? ఏలకల్గునా? పాపీ! పొడువఁబడినను మొండి మృగేశుఁడు శత్రుత్వముతీరక చావఁడు. నాయందింత కృతఘ్నత గల నిన్ను నేనే చంపెదను. (పొడుచును)

సీల—(కొట్టుకొనుచు) హా! హా!! అనుకొన్నంతయైనది. నా కుటిలాత్మ నాకెట్లు ప్రబోధించెనో యట్లేజరిగినది. నాపాపములు నాతలనుఁ గట్టికుడిపినవి. మృగేశా! ధన్యుఁడవు. పుణ్యాత్ముఁడవు. నన్నుఁ జంపి—నాపాప జీవితము నంతముచేసి భూభారమును తగ్గించితివి. ఉదయాదిత్యా! నీకు వందనము. నాగతి యిట్లయినది...... ఓప్రపంచజనులారా! నావలె కుటిలవర్తనులై యున్నవా రందఱ కిదియేగతి. ప్రాణములు నిలచునట్లులేదు. హా! పరమేశ్వరా!...
(మరణించును.)

ఉద—గంగాధరా! ఏమి యీవిపరీత సంఘటనము?

గీ॥ ఇరువురు—సమానవంచకులే యయినను
వీర లన్యోన్యమును నీల్గినార లిచట;
కట్టికుడిపె వారల పాపకర్మ వారి
నింక వీరికై వగచుట కేమిగలదు? 33

గంగా—ఈమృగేశుఁడింకను కొట్టుకొనుచున్నాఁడు.

మృగే—ఉదయాదిత్యా! ఉదయాదిత్యా! పవిత్రుండవగు నీజీవితమున నిర్దోషినగు నన్నుచంపిన పాతకమొక్కటి గలిగెను. ఐనను విచా

రము లేదు. మొదటినుండియు నేను దుర్మార్గుఁడను. నా మరణ మున కింతకన్న నధికస్థితిగల్గదు—రూపలీ రూపచందులు నా సోదరియు జనకుఁడును నగుదురు. వారు హీనగతిని మృతినంది పిశాచములై కాలకేతనమరణమున కెదురుచూచు చున్నారు. నాతండ్రి భూతాకృతిని నాకుఁగాన్పించి నిన్ను శరణువేడి నీసహాయమున కాలకేతనుఁ జంపుమని యానతిచ్చుటచే వచ్చితిని. కాని దైవము వేఱుగాఁదలంచెను. కానిమ్ము. విచారము లేదు. నీవైన కాలకేతనుఁజంపి మాకుటుంబమునకు మనశ్శాంతి గల్గింపుము.

ఉద—మృగేశా! నీయుద్దేశము నెఱుంగక నిన్ను మా గంగాధరుఁడు చంపెను. నన్ను క్షమింపుము.

మృగే—పాపినగు నన్ను నీవంతమాటనఁగూడదు. కాలకేతనుఁ జంపెదనని నాకు వాగ్దానము చేయుము.

ఉద—భగవంతుఁడే వాని నాశనమును సంకల్పించియున్నాఁడు.

మృగే—అట్లయిన నీకు జయమగును. నమస్కారము. నాకుసెలవు. మరణించుచున్నాను— నారాయణ—నారాయణ—నారాయణ—(మరణించును)

(తెర.)

షష్ఠాంకము.



# కాలకేతనము

## సప్తమాంకము.



1వ రంగము—కాలకేతనుని చిత్రశాల.

ప్రవేశము—చిత్రలేఖనముచేయు కాలకేతనుఁడు.

కాల— ఆ॥ చిత్రలేఖకునకు జీవప్రదాన సా
సార్థ్య మొసఁగియున్న మహిని తనకు
పేరుమాయునంచు నోరుపులేమి క
న్బరచుకొనియె నెట్టి బ్రహ్మ తాను॥ 3౮

కాకయుండిన యుక్తాయుక్త విచారణజ్ఞాన శూన్యుఁడనై—చేఁ జేతులఁ జంపుకొనిన నాసులోచనాసతిని నేను మఱల సృజించుకొనక యుందునా? ప్రాణనాయికా! సులోచనా! కన్నులతోఁ జూచుకొంటివి; మధుర మంజులాధరాగ్రమునుండి—మందహాస సుధాతుషారములం జిలుకుచుంటివి; మాటాడవేల? చలింపవేల?—మందభాగ్యుఁడనైన నన్ను దయఁజూడవేల?—నేను నీయందు ద్రోహముఁజేసిన చండాలుఁడనే యగుదునుకాక! నీవు మహాపతివ్రతవుగదా! సతీ! నీకీ యాగ్రహము తగునా?—ఈపాషాణమూర్తియందు ప్రేమబీజములనుజల్లి—ఈ యచేతన కాలకేతన విగ్రహమునందు చైతన్యమును గల్పించిన—దివ్యశక్తివి నీవుగాదా?—ఎంతని నిన్ను బ్రతిమాలుకొందును?—ఒక్క ముద్దిమ్ము. నాయలమటవాపుము. అహోరాత్రములు నిన్నుఁజంపిన మహాకలుష తాపమువలననే—తీఱని యారాటమునఁ గొట్టుకొనుచుంటినిసుమా!

నాశక్తి—నీతోడనే యంతర్హితమైపోయినది. నాశౌర్యము—నావిజ్ఞానము—నావివేచనము—నీజీవములతోడనే యెగసిపోయినవి. కాలకేతన జీవనాంతరాళమునందిప్పుడు కారుమబ్బులు గ్రిమ్మి—గంభీరముగ గర్జించుచున్నవి.

సీ॥ ఎగసి ముద్దాడిన నేమందునోయని
యధరాగ్రము నొకింత యంటినావు
బిగిఁగౌఁగిలించిన పగనెంతునోయని
ముంజేత నాయొడల్ ముట్టినావు
ఏమాటఁబల్కిన నేమితలంతునో
యని నోరుమెదలింప నడలినావు
కనుసన్న నాయానఁ గనిపెట్టి నాకిష్ట
రీతులతో సంచరించినావు

బొంకి యెఱుఁగవు పరిహాసములకునైన
నట్టి నాభాగ్యలక్ష్మినైనట్టి నిన్ను
చేతులారఁగఁ జంపిన పాతకుండ
నింక నరియింప నన్ను శపింపవేమి? 3౫

ఏమి నావెఱ్ఱి? ఈనిర్జీవ ప్రతిమతోడనా నేను సంభాషించుచున్నాను?—ఓరీ! కాలకేతనా! నీమానసికావస్థ తుదకింత నీచమైనదా?

గీ॥ కల్పతరువును ముండ్లడొంకగ భ్రమించి
నాశనముఁజేసి తుదకు ఫలాశనొంది
మూలములఁజేర్చి శిరమును మోదుకొన్న
యధమునకు నీవు దక్కుదువా లతాంగి! 3౬

ఆశాపరిపూర్తియైన ప్రాణికి జీవనపరిపూర్తిగూడ గల్గునందురే! నాప్రాణము లింక నేలపోలేదు? కాదు—కాదు—నాకింకను ఆశాపరిపూర్తి కాలేదు. నా సులోచన నన్ననుగ్రహించుటకు—చిత్రపటాంతర్గతయై వచ్చియున్నది. ఈదేవతాస్వరూపిణికి జీవముప్రసాదించు మహాత్ములు

సిద్ధించుదనుక—ఘోరతపం బాచరింతును. ఎట్లు సాధ్యముగాదో చూచెదం గాక!—

సీ॥ ప్రార్థింతు నొకసారి వరమునీంద్రులనైన
  తరుణికి జీవప్రదానమీయ
వేడుకొంతు నొకసారి విధినైనఁగాని యీ
  కమలలోచనకుఁ బ్రాణములనీయ
జపియింతు నొకసారి సదయుఁడై యీకాంత
  యవనిపై నవతారమందుకొఱకు
బలియిత్తు నొకసారి ప్రాణపంచకమైన
  పటము చైతన్యత వడయుకొఱకు
దిక్కు లడలఁగ విలపింతు నొక్కసారి
ప్రకృతికాంతకు సత్కృపవచ్చుకొఱకు;
స్థిరమయిన విశ్వయత్నంబు సేయువాఁడ;
యెటులయిన సులోచన లభియించుకొఱకు॥— 32

అట్లయిన సత్వరముగ—నీ సుందరవిగ్రహమునకు వర్ణములువేసి పరిపూర్తిచేసికొందును. (పటమునటనుంచి-రంగులు కలుపుచుండును.)
(ఒక బాలుఁడు—బంతియాడుచు ప్రవేశించి రంగును పటముపైఁదన్నును భయముతో—నిలువబడును.)

కాల—(చూచి ఆగ్రహముతో) ఆఁ! ఏమిది? నాబహిఃప్రాణమగు సులోచన పాదతాడిత యగుచున్నదే!—ఎవ్వఁడవురా? తుంటరి బాలకా! నాజీవనమగు సులోచనావిగ్రహము నిట్లు మలినముఁ జేసితివి! కాలకేతనుని యాగ్రహాగ్నింబడఁ గాంక్షించితివా! మందమతీ! చూడుము. నిన్నేమి చేయుదునో.

(కత్తి నెత్తును.)

బాలు—(వణకుచు) అయ్యా! పొరబడితిని. పొరబడితిని. బంతియాడుచు పరాకున తన్నితిని. ఆగ్రహింపకుము.

కాల—ఏమేమీ! పరాకుపడితివా?—దుష్టుఁడా! కాదు; కాదు—ఇది కేవలము కుటిలతంత్రము—కాలకేతనుని యాయువుం దీయలేక వాని ప్రాణములు సులోచనయందున్నవనియు, సులోచనావిగ్రహ వినాశనమునువీక్షించి యోర్వలేక గుండెలుపగిలి నేను మరణింతుననియుఁ దలంచి—నాజీవమారణము నపేక్షించిన శాత్రవులు నిన్నిందుఁ బంపియుందురు—ఛీ! కుటిలుఁడా! నీవు బాలుఁడవని క్షమింతు ననుకొనకుము. ఈకాలకేతనుఁడు దయాశూన్యుఁడు. ఈపాషాణహృదయుఁడు తన యభీష్టమున కంతరాయమగు నధములపాలిటి యకాలమృత్యుదేవుఁడని యెఱుంగుము—

సీ॥ నిష్ఠుర మంగళా నీలకంఠ కుతంత్ర
వచనంబులకు జ్వలించెకొంత;
చెలరేగి యాగభాషీ సులోచనల వ
ధింప దావాగ్నులఁ దేల్చెకొంత;
శాంతికేతనుని భీషణముగా గ్రుద్దు దీ
యుటచేత సలసల నుడికెకొంత;
దుర్వైరికృత మహోఖర్వ మాయాబల
ప్రేరణంబులను ఘూర్ణిల్లెకొంత;
ఈపటంబున శాంతివహించె నిప్పు
డట్టి మద్గర్భగత బడబానలంబు
ప్రళయకాలాగ్నిహోత్రమై ప్రజ్వరిల్లె
నిన్ను జంపకయున్న శాంతింపఁబోదు॥ 3౮

(బాలునిఁ బొడుచును)

బాలు—(క్రిందఁబడి దొరలుచు) హా! నిర్దోషినిచంపిన పాపము నిన్ను కట్టికుడుపకపోదురా—కాలకేతన రాక్షసా! (మరణించును.)

కాల—(కత్తిపారవేసి భీతిల్లి) ఆఁ—ఎంతభయంకరము! ఈబాలుని యాక్రిందనము నాచెవులకు కాలయముని కేకవలె భీకరముగా

వినఁబడుచున్నది. వీనిమాటలకు నాగుండెలు దడదడఁగొట్టు కొనుచున్నవి. శిరస్సు భారమై గిఱ్ఱునఁ దిరిగిపోవుచున్నది. భూమ్యాకాశములు కంపించిపోవుచున్నవి. పాపప్రకంపన దావానలజ్వాల లాభీలములై నాశరీరమునందలి రోమరోమకూపముల నుండి పైకుబికి ఆపాదమస్తకముం గాల్చివేయుచున్నవి. హా! హా!!—అంధకారము—ప్రకృతియంతయు భీభత్సము—భీకరము—అంధకారమధ్యమునం దాయగ్నిగోళములేమి? కావు—కావు—అవి యగ్నిగోళములుగావు. భీకరమగు నొక్క మహాభూతము గ్రుడ్లుఱుముచు నాపైకిఁ గబళింపవచ్చుచున్నది. దాని దీర్ఘజిహ్వాగ్రము నాపాలిటి కాలపాశమై—కంఠనాళములను బిగించివేయుచున్నది. ఇది రూపలీమహాపిశాచాకారము...... ఈపిశాచరూపము—రక్తపంకిలమగు నీపృథ్వి—ఈ నిర్దోషబాలక మృతకళేబరము—చూచుటకు నాకు దుర్భరములై యున్నవి. కన్నులోర్వఁజాలవు—ఏమిసేయుదును? అమాయకుఁడగు బాలకుఁడు హతుఁడై పోయె! నిర్దోషియగు బాలకుఁడు నీచకాలకేతనునిచే నిహతుఁడై పోయె! ఈపాపమింక నన్నెట్లు తొలఁగును?—నాకన్నులను కాలుచున్న యినుపశలాకలచేఁగాల్చి నా నాలుకను నిశితాస్త్రములచేఁ జీల్చి నాపాడుశరీరమును సహస్రచ్ఛిన్నములుజేసి యందు తీవ్రమై మండుకారముంగూరి—చూచి యానందింపఁగల పుణ్యాత్ములులేరా? ఆహా! ఎంతమందబుద్ధిని! ఇన్నిపనులుచేయుట కీకాలకేతనరాక్షసుఁడు తగునుగాక మఱి యొకరిచేత నగునా?

గీ॥ కన్నుగలవారు కడుపారఁగన్నవారు;
కరుణగలవారు కన్నీరుగార్చువారు;
నిండియుండిన ధారుణీమండలమున;
దనుజుఁడై పుట్టె; కాలకేతనుఁ డొకండె॥— ౩౯

బాలకా! బాలకా! నిర్దోషివగు నో బాలకా! తెఱచిన కన్నులు తెఱచినటులేయుండ ఆపాదమ స్తకము ర క్తప్రవాహము వెల్లువయై ముంచివేయుచుండ మరణించితివా! ఆహాహా! విధి ప్రభావము!—ఏతల్లి దండ్రుల కడుపున నీవెక్కడ జన్మించితివో—నాపాలఁబడి హతజీవి వై తివా! పట్టుమని పదియేండ్లైన నిండని నీకు—నే నకాలయముండనై తినా!—నీవు బ్రదికియుండిన నెంత మేధానిధివగుదువో—ఎంత రాజ్య తంత్రజ్ఞుఁడవౌదువో—ఎంతటి కవిశిరోమణివగుదువో—ఎంతటి భ క్త శిఖామణివగుదువో—ఎంతటి సార్వభౌముఁడవగుదువో—నిన్నుఁజంపి నీనుదుట బ్రహ్మవ్రాసిన నీజీవనరేఖం దుడిచిపెట్టితినిగదా! ఇట్టి నాకు గతి యేది? బాలకా! నిర్దోషబాలకా! నీ మొగముఁజూచినకొలఁదియు నా గుండెలు బ్రద్దలగుచున్నవి. నా పాపజీవితము నా కన్నులఁ గట్టుచున్నది. నాగ్రుడ్లు వ్రేలిపోవుచున్నవి. నాశరీరము మండిపోవుచున్నది. పాషాణ నిభంబగు నాగుండెకఱగి నీరై పారుచున్నది. బాలకా! ప్రవాహమై పారుచున్న నీశరీరర క్తమును నాయొడలెల్లఁ బూసికొన్నచో—నాతాపము శాంతినొందునేమో!—(అట్లుచేసి) హా! హా!! ఓర్వఁజాలను; ఓర్వఁ జాలను. ఈ భయంకరతాపమున కోర్వఁజాలను. ఇది ర క్తముగాదు. మహాకాలకూటవిషము. నా ర క్తనాళముల దూరి భగ భగ మండుచు నావిరులఁ గ్రక్కుచుచున్నది. ఇఁక నాకు మరణమే శరణము!— బాలకా! రమ్ము. నిన్ను సమాధిఁజేసి—నేనును నీప్రక్కనే మరణించి— మంటిలోఁ గలసిపోవుదును. (బాలుని భుజముపై వేసికొని) హా! హా!! అగ్నిజ్వాలలు! పాపాగ్నిహోత్రజ్వాలలు! భరింపఁజాల! భరింపఁజాల!!-

(నిష్క్రమించును)

(ఉదయాదిత్యుఁడు సైనికులతో ప్రవేశము.)

ఉద—ఏమిది?—కాలకేతనుఁ డిచ్చట లేఁడే? (నేలపై ర క్తముఁజూచి) ఆహా! ఎంత భయంకరము! మఱల నీర క్తమెక్కడిది? ఈ పాపా

త్ముని చేత మఱియొక మందభాగ్యుఁ డెవ్వఁడో మరణించియుం డును. ఆహాహా! ఎంత యాశ్చర్యకరమైన జీవనము!

సీ॥ కన్నులరక్తంబుఁ గాంచుటే యానంద
కర జీవనంబుగా నరసినాఁడు;
దౌర్జన్యకర్మ ప్రధానంబుగాఁగొని
హత్యలు గావింప నలరినాఁడు;
దురితంబు నెఱుఁగ కీశ్వరునకు వెఱువక
కరుణయించుక లేక తిరిగినాఁడు;
పాపశోషణములే శాపభూషణములే
తనకు మంగళమని తలఁచినాఁడు;
తల్లియిది పిల్ల యిదియని తలఁపకుండ,
నందఱను సమబుద్ధినే యరసినాఁడు;
చేయుచున్నాఁడు హత్యలే జీవితాంత
మీఁతఁ డోకరాక్షసుం డగుటే నిజంబు॥ ౮౦

(బయటఁ బరికించి) సైనికులారా! అల్లదే కాలకేతనుం డొకకత్తి బరమును భుజమున నిడుకొని యున్మత్తునివలె శ్మశానమువంక కరిగినాఁడు. మనము వెంటాడి వానిని చంపుదము రండు.

(అందఱును నిష్క్రమింతురు.)

(తెర)

•••○O○•••

## 2 వ రంగము—శ్మశానము.

(అనుబంధము 15.)

కాల—నేనే నీకు కొడుకను; నీవే నాకు తండ్రివి; నిన్ను నేనే మన్నుజేసెదను. బాలకా! ఇచ్చట పరుండుము. నీప్రాణములం దీసిన పాపాత్ముఁడే నీకోమలాంగమునుగూడ పృథ్వీభూతము నలయుఁ

పఁజేయఁగలఁడు. (పరుండఁబెట్టి శ్మశానమెల్లఁ గలయఁదిరుగుచు) అహో! ఈశ్మశానము నాకెంత భీకరముగాఁ గనఁబడుచున్నది!

సీ॥ నరజీవనాటక భరతవాక్యముఁబాడ
ప్రభువు నిర్మించిన రంగమిద్ది
క్షితి నకాలమృతినిఁజెంది ప్రేతములై యె
సంగు జీవుల నాట్యశాలయిద్ది;
పూడ్చినశవముల భువి కీడ్చు టక్కరి
నక్కల బువ్వంపు టిక్కయిద్ది;
ఎట్టిపామరులకునేని వైరాగ్యంబు
సంధించు వేదాంత సదనమిద్ది
శాంతమై—నిర్జనంబయి—చటులహృదయ
భీషణంబయి భీమమై — పిఱికివారి
గుండె లవియించెడు శ్మశానకూటమిద్ది
కాలమృత్యు కరాళ సంకాశమయ్యె॥ ౪౧

అహో! ఎంతయమానుషకృత్యము! ఈ సమాధులయందు సగమున కధికముగా నా కరవాలాహతుల మరణించిన యభాగ్యులవేకదా! నే నెట్టి క్రూరకర్ముఁడను. నాజీవన మెంత పాపపరిపూర్ణము! నాతో సమానముగ నీశ్వరునిచే సృజింపఁబడిన నాతోటివారి నన్యాయముగ వధించుటకు నాకధికారమేమి? ఎన్నికొంపలు దిగఁగూల్చితిని! ఎందఱి పాలిఁటి కకాలమృత్యుదేవత నైతిని? అందొకటికైన నన్నుచంపునంతటి సాహసము గలుగకపోయెగా! ఓనిర్భాగ్యురాలవగు నాజననీ! ఈభూమికి భారముగ నన్నేలఁగంటివి?—నన్నొక యకాలయముని గావించి యందఱి ప్రాణములను దీయించుటకేనా? నిరపరాధినియగు రూపలిని బట్టితెచ్చి నమస్కరింపనంతమాత్రమున మహాదోషముగఁ బరిగణించి యీసిలువపై నురిదీసితినే!—ఎట్టి వజ్రమయ హృదయుఁడైన, ఎట్టి కిరాతుఁ

డైన, నెట్టి కసాయివాడైన నందుల కియ్యకొనఁగలఁడా?—ఇందఱికన్న
నే నధముఁడ నై తినిగదా! రూపలీ! రూపలీ! సిలువపై నింకను వ్రేలాడు
చున్న నీజీర్ణదేహమునుఁజూచిన నా ప్రాణములు నిలువున నెగిరిపోవు
చున్నవి. అవిగో! కాలకేతన నిర్మితములగు కపాలస్థూపములు. నిర్దోషు
లగు నా సైనికుల నందఱను చంపిగదా వారిశిరస్సులతోడ నీ స్థూప
ములం బ్రతిష్ఠింపఁజేసితిని! ఇచ్చటనేకదా రూపలీ పరాభవముంజూచి
కడుపుపగిలి, కంఠరక్తనాళములుతెగి, రూపచంపు రక్తముంగ్రక్కుచు
మరణించె. అమాయకుని ఆగభాషిని దోషినిగానెంచి చంపితినే!—
పశుప్రాయుఁడనై—దురాత్ముల కుటిలతంత్రమును గ్రహింపలేక, సులో
చనను చంపి, కులవర్ధనుండగు నేకపుత్రుని గ్రుడ్లుతీసితినే! సకలానుభవ
ములును సంపూర్ణముగనైనవిదప సయితము జన్మదోషసంజనితంబగు
తామసంబు చావక, ఈపసిబాలు నొకని నాపొట్టను బెట్టుకొంటినే!—
ఔరా! ఇట్టి రాక్షసుఁ డెందైనఁ గలఁడా? ఇంతకన్న నిర్భాగ్యుఁడు,
ఇంతకన్న నధముఁడు గలఁడా?—ఈపరితాపము నన్ను కాల్చివేయు
చున్నది. నాకింతకన్న యమయాతన లధికము లగునా? హా! సులోచనా
సమాధి యిచ్చటనేయున్నది. నాశాసనముననే కాఁబోలును పవిత్రమగు
నీసమాధి పుష్పములచేఁ బూజింపఁబడుచున్నది. ఈపూవులం దొల
గించి నాసులోచనం జూచుకొందునా?— నాభాగ్యలక్ష్మి కీ సమాధి
యేల? బయటకుఁదీసి యా సుకుమారాంగకములఁ జూచుకొందును.
(సమాధినిపెకల్చి) హా! హా! ఎంత నిర్భాగ్యుఁడను! నా సులోచనాశరీ
రము భూమిలోఁగలసిపోయి కేవల మస్తిపంజరము నిలచియున్నది—
ఓదేవీ! నిన్నుఁజంపినపాపి యిదుగో—మొండివై జీవించియున్నాఁడు.
నీలోఁ జేర్చుకొనుము.

(అనుబంధము 16.)

హా హా! దుర్భరము! దుర్భరము! నే నీశోకమును భరింపలేను.
నావలనఁగాదు. ఇంతకన్న మరణ మతిశ్రేయస్కరము! చావనేవలయు.

ఈపాపికాలకేతనుఁడు చచ్చినఁగాని ప్రపంచకము నిష్కంటకముగాదు. (పొడుచుకొనఁబోయి) నేనెంత మందబుద్ధినై మరణింపఁ దెగించితిని. నేను మరణించినను నాదుర్యశము మాయునా?—భవిష్యజ్జనులు కాల కేతన కలుషసహస్రంబు వాకొనరా?

సీ॥ కాలకేతనుఁడు దుష్కర్ముఁడై సిలువపై
రూపలిప్రాణంబు వాపెనంచు
కాలకేతనుఁడు ముష్కరుఁడయి సేనలఁ
గడతేర్చి స్థూపముల్ గట్టెనంచు
కాలకేతనుఁడు నిష్కరుణుఁడై నిజసతి
యగు సులోచన దునుమాడెనంచు
కాలకేతనుఁడు చండాలుఁడై తనయుని
హింసించి కనులు దీయించెననుచు

కవియొకం డెవ్వఁడో నాటకముగ వ్రాయ
దాని పఠియించి నటియించి ధరణిజనులు
నన్ను దూషింపరే జగంబున్నదాక
శత్రులైన చాళుక్యులు సంతసింప॥— ౪౨

కావున, నాదౌర్జన్యములకును— నారాక్షసకృత్యములకును చిహ్నంబులగు నీ సిలువను కపాలస్థూపములను నాశనముజేసి పిదప మరణించెదగాక!—(అన్నిటిని కూలద్రోసి) ఓకాలకేతనమా! ఏల నింక గాలిలో రెపరెపఁ గొట్టుకొనుచుంటివి? నాదృష్టి యింకను నీపైఁ బడ లేదనియా? నిన్నుమాత్ర మింక నుండనిచ్చెదనా? మత్కళంకకాలచరిత్రము నంతరాళమధ్యమున నెగురుచు నీవు జగంబునకుఁ జాటకుందువా! నిన్నుమాత్రి మేలనశింపఁజేయకుందును!—(కాలకేతనమును విఱిచి ఆహా! ఆత్మనాశనమున కింక నాటంక మేమియును లేదుగదా!(ఆకాశముం జూచి) ఏమిది! అంబరచారులు నవ్వుచున్నారు! ఓ దేవతలారా! నా జీవితముంగని మీరు నవ్వవలదు. ఏమందురేని,

సీ॥ పరమేశ్వరామోదకరమైన యీనాట్య
రంగముకొఱకు నిరంతరంబు
ప్రకృతినాటకకర్త రచియించుచుండు విం
తగ నెద్దియే నొక్క నాటకంబు
ఈజనం బఖిలంబు నాజాతియని యాత్మ
నెఱుఁగ కీ పాత్రనటింపలేదు
ఈనాటకంబున నెవ్వఁడో యొక్కఁడీ
పాత్రను దాల్పక వలనుపడదు

ఇహజనులకెల్ల పాత్రతనిచ్చు పూజ్యుఁ
డింత రౌద్రరసము నటియింపుమనుచు
నే సమర్థతఁగాంచి నాకిచ్చినాఁడొ
కాని నేను విరోధిని కానుకాను॥ ౮౩

ఓజగదీశ్వరా! నీవు సృజించినబిడ్డఁడనై—నీసృష్టిని నాశనము గావించితిని. ఇట్టి యధమాధముఁడనగు నాకు నీసాన్నిధ్యమున పుణ్యలోకప్రాప్తిలేదు. నే నధఃపతితుఁడను—ఆత్మవంచకుఁడను. ఇఁక నాకు గతియేది? జగద్వంచకులకు—పాపాత్ములకు—నికృష్టజీవులకు—చండాలురకు—శిశు స్త్రీ మారకులకు గల్గు గతులకన్న నతిహేయమగు గతి నందుదును కాబోలును! హృదయమా! ప్రీలిపోకున్నావేమి? ప్రాణమా! విడిచి చనకున్నావేమి? కలుషకాలకేతన కంధరమా! సహస్రశకలములు గాకున్నావేమి? పాపము—ప్రతీకారము—ప్రాయశ్చిత్తము—పశ్చాత్తాపము—(మూర్ఛిల్లును.)

(ఉన్మాదినియగు ధారుణి ప్రవేశము)

తత్వము—హిండోల్ రాగం టీక.

ధారు—ఈశ్వర—సంకల్పమూ—మానవ ఊహావికల్పమూ॥
జలపాతముననుకాష్టం। బులు కలసి వియోగమందు పోలుపున

నీ జీ। వులు। కాలవేగవశమున। గలసి వియోగంబు నందగల రీధరలో ॥ ఈ ॥

అది యెఱుంగలేక జనము। లకట! బాంధవులమటంచు। తుదకిల్లా దురుగా సకలమును విడచి॥ తుద కిల్లాదురుగా ॥ ఈ॥

కాల—(లేచి) ఈశ్వరసంకల్పమూ । మానవ ఊహావికల్పమూ॥ నరుఁడొకటి తలంపఁగ నీ।శ్వరుఁ డొకటి తలంచుటెల్ల సత్యము। పరమే । శ్వర నరసంకల్పములకు । నరుదగు నైక్యంబుగల్గు ట వనినిమరి యీ । జగము సకల మతని లోన । జననమంది సమయు చుంట । నతఁడే ప్రభువౌ । ఈజగముల । కతఁడే ప్రభువౌ॥ ఈ॥

ధారు—జనియించినపుడె దుఃఖము । మన నుదుట లిఖించె బ్రహ్మ । మరణసమయమం । దును దుఃఖమే వినంబడు । ననయము జీవి తంబెల్ల నతిదుఃఖంబే । యనుచు జగము । శోకమయముగా నెఱింగి పరమపదము । నరయఁ గావలెగా శాశ్వతగతి । నరయఁ వలెగా ॥ (సులోచనసమాధికడ కేగును.)

కాల—ఘనశక్తియుతులమని యీ । జనములు గర్వించుట ప్రశస్తము గానఁ దనభారమెల్ల భగవం । తుని పయినిడి జీవయాత్ర త్రోయఁగవలయుఁ అఘము సలిపి యలఁతఁనొలిపి । మమత నంది వెతలగుంది।పతితుండౌనుగా । మానవు డిలలో । పతితుం డౌనుగా॥ ఈశ్వరా॥— (సులోచనసమాధికడ కేగును.)

(ఇద్దఱు నొకరినొకరు చూచుకొని బెదరి దూరముపోవుదురు.)

ధారు—(నవ్వుచు) ఇతఁడొక వెఱ్ఱివాఁడు; ఇతఁడొక వెఱ్ఱివాఁడు; నన్ను బెదరింపవచ్చినాఁడు.

కాల—ఓ పిశాచాకారిణీ! నీ వెవ్వతెవు?

ధారు—నేనా? నాజీవితమా? నాచరిత్ర మేమనియా ప్రశ్నించెదవు! పతిచేఁ బరిత్యజింపఁబడి—ఏక కుమారుని గ్రుడ్డుతీయఁబడి—

పుత్రభిక్ష నిడెదనని నాకు వాగ్దానముచేసిన పవిత్రస్వభావురాలు సయితము పతిక్రోధభూతమునకే తన జీవితములను బలియీయ నిట్లు దిక్కులేక, చచ్చుదారిలేక—చంపువారులేక, ఉన్మత్తురాలనై —మనశ్శాంతికొఱకు శ్మశానమార్గముం బట్టితిని.

కాల—(స్మృతికిఁ దెచ్చుకొనఁ బ్రయత్నించుచు) అయోమయము—అయోమయము—గుండెలు ఝల్లుమనుచున్నవి ఒక్కటియు స్మృతికిరాదు. ఇదియంతయు నాచరిత్రమువలెనే యున్నది. ఇట్టి మందభాగ్యుఁడే దీని శోకపతియుండెనా? అట్లయిన నాకు మనశ్శాంతి—మనశ్శాంతి—ఇంత క్రూరుఁ డింకొకఁడు గలఁడా? మేమిద్దఱ మొకచోటికే పోవుదము. ఓ యమధర్మరాజా! నీలోకమున నిద్దఱికి స్థలముచేసి యుంచుము.

ధారు—ఓ యున్మత్తుఁడా! నీవెవ్వఁడవు?—

కాల—అదియే బోధపడుటలేదు. ఆలోచించుచున్నాను. నేనును, ప్రథమపత్నీపరిత్యాగముచేసిన పాపినే—నేనును, ఏకకుమారుని గ్రుడ్డుదీసిన దుష్టుఁడనే—నేనును, ధర్మపత్నిని చంపిన దౌర్భాగ్యుఁడనే—నేనును,నీపతివంటివాఁడనే—(స్మృతికిదెచ్చుకొన ప్రయత్నించుచు) అదియును నిజమే! ఈకంఠస్వరమే యది; ఎన్నఁడో వింటిని; అత్యంత పరిచితమైనది; కాని యిప్పుడు విస్మృతమైనది. అదియే స్మృతికిరావలయు—ప్రయత్నించినను రాకున్నది.

ధారు—(దగ్గఱకువచ్చి శిరోజములను పట్టిచూచుచు) అదియే మృదుత్వము; అవియే శిరోజములు;అతఁడే యితఁ డేల కాఁగూడదు?—కాదు; అనుమానము లేదు. అతఁడే యితఁడు. మహాత్మా! నీ వున్మత్తుఁడవుకావు. నీసంగతియంతయు నే నెఱుఁగుదును. నీవెవ్వఁడవో చెప్పుము.

కాల—అబలా! ఈపాపాత్ముని పేరు వినఁగూడదు. నీకేల పొమ్ము.

ధారు—నేనును పాపాత్మురాలనే. అవశ్యము వినవచ్చును. చెప్పుము.

కాల—అశుచిసూచకమగు నల్లనిపెక్కెము పేరుగాఁ గలవాఁడు.

ధారు—కాలకేతనుఁడా?

కాల—ఊఁ—ఉన్మత్తనై నను నిజము గ్రహించితివి. అదియే నాయశుభ నామము.

ధారు—నా కాలకేతనునకా? ఇట్టి రూపము? నమ్మఁజాల-నమ్మఁజాల—

కాల—పాపాత్ముఁడనని చెప్పితినే! నీకేల నమ్మకముగలుగదు? పాపాత్ములకు పవిత్రాకార మెక్కడిది?

ధారు—కాలకేతనుఁడ వేనా? నిజమేనా?

కాల—ఔను. నిర్భాగ్యుఁడగు వీఁడే వాఁడు.

ధారు—(కౌఁగిలించుకొని) ప్రాణేశ్వరా! ఈమందభాగ్యురాలి నిఁకనైన క్షమింపవా?

కాల—నీవెవ్వతెవు? నన్ను వదలుము.

ధారు—ప్రభూ! వదలుటకు రాలేదు. ఈధారుణి నిఁకనైన క్షమింపుము.

కాల—హా! శిరమున పిట్టపిడుగునడెసది. ధారుణీ! ధారుణీ! నీవింకను బ్రదికియుంటివా? ఏల నాపాపపుమొగముఁ జూచెదవు? చేసిన పాపములవలన కాలకేతనుఁ డిప్పుడు మీమొగములనుఁ జూచుటకు దొంగనైయున్నాఁడు. ఈదేహమును తాకకు. తాకకు; నీవు పుణ్యస్వరూపిణివి. నేను నీ కుమారునిఁజంపితిని. నన్ను నీవు చంపుట కేలరాలేదు?

ధారు—ప్రభూ! నిన్నుఁజంపుటకు రాలేను; నీచేఁ జచ్చుటకు వచ్చితిని.

కాల—ఇంకను నాతలపై హత్యాదోహము లేల? ధారుణీ! నన్ను వదలిపొమ్ము—నన్ను వదలిపొమ్ము—

ధారు—ప్రభూ! ఆమాటాడకుము.

(తెరలో కోలాహలము)

కాల—ఆఁ—అదియేమి? ఓహో! చాళుక్యులు నన్ను ముట్టడించి చంపవచ్చుచున్నారు. ధారుణీ! స్త్రీవగు నీ విందుండఁగూడదు. పొమ్ము.

ధారు—ప్రభూ! నాకు దిక్కు లేదు. నీయనంతరము వితంతువునై నేను జీవింపలేను. ఇదిగో! కటారి; దీనితో నన్నుఁబొడిచి శత్రుల జయింపుము. (కత్తి నీయఁబోవును.)

కాల—ఈ స్థితియందు శత్రువులకు మన మిద్దఱమును పట్టువడుటకన్న నిదియే సదుపాయము. కాని—ధారుణీ! సాధ్వీమణీ! నిన్ను చంపుటకు నాకు చేతులు రావు. ఏమి సేయుదును? వీఁడు వెనుకటి కాలకేతనుఁడు గాఁడే! ఎట్లు చంపఁగలఁడు? (తెరలో ధ్వని)

ధారు—శాత్రవులు మఱింత సమీపమునకు వచ్చుచున్నారు. త్వరపడుము. ప్రభూ! త్వరపడుము. ఇదిగో! వక్షస్థలము—ఒక్కటే పోటుపొడిచివేయుము.

కాల—చంపెదను. ధైర్య మవలంబించెదను.

(కత్తిదీసికొని ప్రయత్నించి చంపలేకపోవును.)

ధారు—నా మొగము మీకుఁ గనఁబడుచున్నంతదనుక మీకు ధైర్యము గలుగదు. మెడ వంచితిని. ఇప్పుడు ఖండింపుఁడు.

కాల—(చంప యత్నించియు చంపఁజాలక) నీ శిరస్సునుఁ గాంచినను నాకు ధైర్యమాగుట లేదు. నీవంకఁజూడకుండఁ బ్రయత్నింతును. (మొగము రెండవప్రక్కగానుంచి చంపయత్నించియు విఫలుఁడై కటారిని క్రిందఁబడవేయును. (తెరలో ధ్వని.)

ధారు—అయ్యయ్యో! ఎట్టిధైర్యశాలి కెట్టి పిఱికితనము గలిగెను! నాథా! మీరు విచారింపఁదగదు. నాజీవితమున మీచేత మరణించుటకన్న భాగ్యము లేదు. ప్రాణేశ్వరుని సుందరవదనమండలముం జూచుచు అతని చేతికటారివలన ఆనందముతో ప్రాణత్యాగము చేయుటకన్న—నీదేహి కేమికావలెను!—

కాల—కటకటా! ఈస్థితియందుసయితము-కాలకేతనునిచేతికి హత్యయే యలంకార మనుకొంటివా! మాలదైవమా!

సీ॥ చాలదా! నాకు విశ్వాసపాత్రుండైన
యాగభాషినిఁ జంపినట్టి యఘము
చాలదా? నాకు! ప్రజ్ఞాన్వితుండౌ సుతు
కనుగ్రుడ్లు దీసిన కలుషఫలము
చాలదా? యల సులోచనను దుర్బుద్ధినై
దునుమాడినట్టి యా దురితకర్మ
చాలదా నాకు? నసంఖ్యాకులైన సై
నికులను చంపిన నిష్ఠురంబు
చాలదా? యమాయకుఁడైన బాలునొకని
కోపమున మృతుఁజేసిన పాపఫలము
చంపుమని వచ్చినట్టి యీసతినిఁ గూడ
వధము సలుప లిఖించితివా? విధాత! ౭౭

శత్రువులు వచ్చుచున్నారు. ఇంక నాలసింపఁదగదు. జగదీశ్వరా! ఈపాప మెవ్వరిదో నే నెఱుంగను. కాలకేతనునిదేమైనచో, దీనినిసయి తము—పూర్వార్జిత పాపములం గలిపివేయుము. (చంపుచున్నాఁడు)

(ఉదయాదిత్యుఁడు సేనలతో ప్రవేశము)

ఉద—ఛీ! ఛీ!! కాలకేతనరాక్షసా! క్రూరకర్ముఁడా! తుదకిట్టి నీచావస్థ యందు సయితము—స్త్రీవధముఁ జేయుచుంటివా?—

కాల—నీవు వచ్చితివా? ఉదయాదిత్యా! ఏమిచేయవచ్చితివి? నన్ను బంధించుటకా? చంపుటకా? నీవలనఁగాదు. నీవలనఁగాదు— పొమ్ము.

ఉద—ఏమిరాపాపీ! ఇంకను జీవించియుండి వధోద్యోగముతోడనే పొట్ట బోసికొని—రక్తముఁద్రావి, దాహముఁ దీర్చుకొనఁ దలఁచు చుంటివా? భగవంతుఁడు నీకిప్పటికైన రవంతప్రేమ నొసంగక పోయెనే?—

కాల—ఏమిరా? నాహృదయమున ప్రేమ లేదనుచుంటివా? ప్రేమమూలమునసే—నాప్రేమ కంతరాయము గలిగెనను దుఃఖమువలనే—ఆగర్భాష సులోచనా మంగళలం జంపితిని. ఇప్పుడు ప్రేమించుచునే—ప్రేమాపాంగములతోడనే— ఈ ధారుణిం జంపితిని. నన్నుఁ జంప నీతరముగాదు—

ఉద—తరముగాదా? తరముగాదా? ఇంకేమి ప్రేలెదవు? నీయంత్యకాలమిదే! కాచుకొమ్ము. ఇదిగో కరవాలము.

కాల—నేను చచ్చుట నిజమే! జీవితాశలేని నేనెట్లును చావసిద్ధపడితిని. కాని—నీవు బ్రదుకఁదలంచినవాఁడవు! నీబ్రదుకు చూచుకొమ్ము; నీవు చచ్చిన పిదపనే నేను చావఁదలంచితిని.

ఉద—నన్నే చంపఁగలవా?

కాల—ఇదిగో! నాసేనలుగూడ వచ్చినవి. సైనికులారా! చూచెదరేమి? ఈచాళుక్యులను చంపుఁడు.

(సైనికులు తిరుగఁబడి కాలకేతునివంక కత్తులుదూతురు.)

ఉద—ఇప్పుడు చూచితివా? నీదౌర్జన్యములచే—కడుపుమసలియున్న నీసేనలేమి? నీకు సహాయమగుటయేమి? కడుపుమసలిన సైనికులు తిరుగఁబడకుందురా? ఇంక నీ కేదిక్కును సహాయము లేదు. సేనలారా! వీనిని చంపుఁడు. (సైనికులు మీఁదికి వత్తురు)

కాల—వలదు; వలదు—నిలువుఁడు—ఉదయాదిత్యా! నామాట వినుము. నాపైకిరాకుండ సేనల కానతిమ్ము. నీతో నించుక సంభాషింపవలయును.

ఉద—సేనలారా! నిలువుఁడు. ఇతనిని భాషింపనిండు. మనచేఁ జిక్కిన వాఁడెందు బోఁగలఁడు?

కాల—నేను మరణింపఁదలఁచియే యుంటినిగాని—నీచేఁ జావఁ దలంపలేదు.

ఉద—అటులనా?—(క్రిందనున్న కటారిని లాగివేసి) నీయాత్మహత్యా ప్రయత్నముకూడ శూన్యమైనట్లేకదా! ఇక నీమరణము నా చేతనే యున్నది.

కాల—వెఱ్ఱివాఁడా! కటారితోఁ బొడుచుకొని చత్తుననుకొంటివా? ఇదిగో చూచితివా! నా దంతములందున్న విషగోళికలు—నా కెప్పుడో యిట్టిమరణము తప్పదనియు—శత్రువులచేఁ బడకుండ నాత్మనాశనమున కివి పనికివచ్చుననియు—నిట్లు సిద్ధముగ నుంచుకొంటిని.

ఉద—ఆహా! ఎంతదారుణము!

కాల—(గోళికలు కొఱికి) ఉదయాదిత్యా! విషముఁ దింటిని. విషముఁ దింటిని. ఇంక రెండునిమిషములలో మరణింతును. నామొగము వివర్ణమైపోవుచున్నది. నేను మహాపాతుక్ఁడను. నరకమునకే పోవుచున్నాను—వినుము. ఉదయాదిత్యా! వినుము—అందఱను చంపుకొనితింటిని. ఇఁక—నాకెవ్వరును లేరు—నీవు చాళుక్యుల కధిపతివై స్వేచ్ఛగా ధరాపరిపాలనం బొనరించుకొనుము. నీకు శుభంబగును. కన్నులు తీయఁబడి నాకుమారుఁడు—హా! దుర్భరము—దుర్భరము—నాకుమారుఁడు—శాంతికేతనుఁడు—అకాలమృత్యుకరాళమునం బడినాఁడు. ఇక నాకు వంశాంకురమైనను లేదు. నా కవసానకాలము వచ్చినది—విషతాపము—శరీరమెల్లఁ బ్రాకిపోయినది. అంతయు నంధకారమైనది. ఓజగత్ప్రభూ! రక్షింపుము. నన్ను నీ సన్నిధికిఁ జేర్చుకొనుము—

(మరణించును)

ఉద—ఆహా! ఎట్టి భయంకరవ్యక్తి—యీప్రపంచనాట్యరంగమునుండి నిష్క్రమింతుఁడైనాఁడు. ఈ కాలకేతనుని పశ్చాత్తప్తాత్మకు ప్రశాంతిగల్గుఁగాక! మఱియును,

గీ॥ ఉర్వీపతి ప్రజావైరిగాకుండుఁగాత!
కలుషమతులకు నాశంబు గలుగుఁగాత!
నీతియుతులకు విజయంబు నెగడుఁగాత!
సత్కవిత జనాదరణ ప్రశస్తమగుత!॥— ౭౫

అనుబంధము. 17.

గంగా—తథాస్తు.

(తెర.)

సోమరాజు రామానుజరావుచే రచియింపఁబడిన.

కాలకేతననాటకమునందలి

సప్తమాంకము—సర్వమును

సంపూర్ణము.



# కాలకేతనము



## అనుబంధములు.



### (1) రూపలి—(బ్యాగ్ రాగం—ఆదితాళం.)

ఓహో కుటిలహృదయా ॥ఓహోహో॥
నీ సాహసము। కాం। తలయెడలనా ॥ఓహో॥
బాహుశక్తి ప్రదర్శింపదలచిన। పరిపంధుల సంగరరంగంబున।
నోహటించిగెలిచి జయముగాంచుట। యుక్తమగునుగాక నిదిఘనమె॥ఓ॥

### (2) ఉదయాదిత్య గంగాధరులు (కాళింగడరాగం-ఆది)

పరాత్పరా ఘన।పరాభవంబెటు। భరింతుమోయెటు తరింతుమో వెత ॥ప॥
అరాతియగు కాలకేతనుండౌక । నరాశనుండయి హరించె రాజ్యము ॥ ప ॥
(దాద్రా) హతవి। ధివశ। మునను సేన। హతమునంద। హితులు సుతులు। గతాసులై శత్రుహస్తగతమయిచనె రాష్ట్రమెల్ల ॥పరా॥

### (3) మంగళ—కన్నడరాగం—ఆదితాళము.

దుర్మతివై పరిభవించెఁ। నా। మర్మములంటనాడెఁ ॥దు॥
కర్మవిధానమౌరా । దు । ర్ఘట మతిక్రమింపా ॥దు॥
గర్విత సులోచనసతిఁ । ప । కరణి బరాభవింతుఁ । దుర్వార
కుతంత్రరీతిఁ । గర్వంబు హరించు భాతిఁ ॥దు॥

(4) కాలకేతనుఁడు—(బ్యాగ్ రాగం—ఆదితాళం.

నా యెదుట నేనా । తులువా । పలువా। యనృతాలాపంబులు॥నా॥

ధీయుతవలె నీయవమతిదోపగ । పాయని యీ । ర్ష్యను గన్పర చుచు । న్యాయాన్యాయములను గమనింపక।నాసులోచనను । దూషణ సేయుచు ॥నా॥

(5) కాలకేతనుఁడు—(భూపాలరాగం—జప్ తాల్)

ఈపరీ । తాపంబు । నకు హేతువేమొకో । పాపమోయిది దైవ శాపమో । కనజాల ॥ఈ॥—

ఆపాపవైరి యుద । యాదిత్యుఁడటుల న । న్నే పరాజితుజేసి । యేగె దోర్బలముచే ॥నీపరీ॥—

చింతయో హృదయ వి । భ్రాంతియో మద్గురుం । డంతరాళ మున భూతాదర్శనముజేసె ॥ఆ॥

(6) నీలకంఠుఁడు—జంఝూటిరాగం—ఆదితాళం.)

ఈపలుకులకు సహింతునా ॥ ఈ॥

ఆపాపాత్మకు డవమతి నాడిన ॥యీ॥

కోపంబును పరి । తాపంబును సం । క్షోభంబును । రిపునాక్షే పంబును । గూడి యతిహీనవాక్యంబుల నను గ్రూరంబున నాడఁగఁ జేసెఁగటా ॥ యీ॥

(7) కాలకేతనుఁడు—(మోహనరాగం—రూపకం)

ఎంతటి రాజద్రోహ । మెంతటి పితృద్రోహ । మంతరంగమున దలంచెగా । ఈపాపచిత్తు ॥డెంత॥

స్వాంతమందు కాలకేతను । డంతకుఁడని తెలియఁడయ్యె । నింత
లోన కనులు మండెనా । నాపాలనమున ॥ కెం॥

చంపదలచెనా । నన్ను । లంచమొసగెనా । ఖలుఁడు । కంపితుఁ
జేతు । కన్నులుదీతు । కారముగూర్తు । ఖలుని బోకార్తు ॥నెం॥

(8) కాలకేతనుఁడు—(బ్యాగ్ రాగం—ఆదితాళం)

ఓరి దురాత్మా శూరసభాస్థలి । నవినయముల నిటులాడెదవా ।
కారులుప్రేలగ । కపటము జూపగ । కాలకేతనుని నెఱుఁగవుగా ॥ఓ॥

కక్కినకూటికి నాశవహించిన కుక్కవోలె । మాతను గూడి
తివా । చిక్కితివిక నాచేత దురాత్మా । ముక్కలుజేయక మాన
నీతనువు ॥నోరి॥

(9) కాలకేతనుఁడు—బ్యాండుస్వరం—దాద్రా.

చండశాసనప్రతాపమండితుండనైన నాకుమారుబల్కుటా॥ చం॥

అండ నీకెవఁడు బ్ర । హ్మాండజాలంబులెల్ల।గుండెలదర । మతులు
జెదర । గడువడి గడగడవణంక ॥ చం॥

(10) సులోచన—సావేరిరాగం—రూపకం.)

గంగాధర । హరహర । దనుజారీ ॥ శ్రీ ॥ గంగా ॥

అంగజభంగా । భవభంగా । త్రిపురాసురవిదారి ॥గంగా॥

సంగతసుగుణాంకా । స । న్నుత బాలశశాంకా । శృంగార
సాంబా । భవహర భవహర । భవహర ॥గం॥

(11) కాలకేతనుఁడు—(హిండోల్—ఆదితాళం.)

కానీ యెటులయినగాదగుగా । ఈపాపముల కెద నింతయు భీతిల
నెద ॥కా॥

హీనచరితులగు నీ పాపాత్ముల । నెల్లర నమ్మకమున వధింతుగా।
మానసీయుఁ డొకడయినలే డఖిల।మారణహోమంబొనరింతునుగా॥ కానీ॥

(12) నీలకంఠుఁడు—(హిండోల్ రాగం—ఆదితాళం.)

ఎట్టికపటతంత్రము ఘటియిల్లెనో । యేమాయెనో నాకెటుఁగ
బడదకట ॥ యెట్టి॥

గుట్టుబట్టబయలుగాక నను పసి । బట్టి కాలకేతనుండు విషమ
ప । రీక్షజేసి శ్లేషవాక్యములగా । రించి వంచనంబొనర్ప దలచెను ॥ఎ॥

వాని మీసములలోపలి నగవులు । వాని మోసమార్గము గను
తగివులు । వాని విసపుమాటలలో నగవులు । గాన కుటిలహృదయంబు
స్పష్టమా ॥ నె॥

(13) మంగళ—(సారంగరాగం—జప్ తాల్)

కాపాడఁగారావు । నాప్రాణధనమా ॥ కా॥

ఈపాపమతుల । పరి । తాపచిత్తులజేయ ॥ కా॥

హా జీవితేశ యుద । యాందిత్య భూజాని । నీజీవితేశ్వరిని। నేడు
బాధించెగా ॥ కా॥

(14) నీలకంఠుఁడు—కవాలీ—అటతాళం.

(క్యాకరేలాంచారహోకర్-వలె)

ఈశ్వరా శార్దూలముఖమున । నెట్లు మృతిగన జేసితో । విశ్వ
మున నాకెంత హీనత ఫాలతలమున వ్రాసితో ॥ ఈ॥

కాలకేతన హాతకుడెట్టి యు।కార్యముల నొనరించునో । కాలుఁడై
నాపాల నెపుడేకరణి హాతునొనరించునో ॥ ఈ॥

## (15) కాలకేతనుఁడు—(కవాలీ—అటతాళం)

హా విధీ నాజీవనాశంబాయెగా హతమాయెగా ॥హా॥
నావినాశపుకాల మాస । న్నంబుగా ప్రళయంబుగా ॥హా॥
ఈ కలుషహస్తంబు ధరలో । నెన్నిహత్యలు సలిపెనో । లోకు లకు సంతాప మెంత వి । తాకుగా నొనరించెనో ॥హా॥

## (16) కాలకేతనుఁడు—(కవాలీ—అటతాళము.)

ఎంతదోషంబయ్యెనో । నా । కెంత పాపంబయ్యెనో ॥ఎం॥
ఎంత కలుషాత్ముండనో । నే । నెంతయదయాత్ముండనో ॥ఎం॥
సాధ్వి నాయర్ధాంగిలక్ష్మిని సంహరించిన పాపమో । నిర్దయుఁ డనై బహుళహత్యల నెగడజేసిన దురితమో । భూతమై వెంటాడె నన్నిటు । లేది తరణపాయమో । ఘాతుకుఁడనను ఖ్యాతిగాంచితిగా మహత్తరతాపమో ॥ఎం॥

## (17) మంగళము—(అందఱు)

బ్యాండుస్వరము—దాదా౯.

మంథరధర మంగళకర మంగళంబురా।
మారసుందరా । శ్రీరమేశ బో౯వరా।
దాసభరణ దోషహరణ దానవేశనాశా।
రాజరా । జేశ్వరా । యోపరాత్పరా।
శ్రీనివాస జగధీశా । శ్రీరమా । నాయకా। జగన్నాయకా॥మం॥

సం పూ ర్ణ ము.



# రంగూన్ రౌడి

(గ్రంథకర్త:—సోమరాజు రామానురావుగారు)

ఆంధ్ర బర్మారాజ్యములందు స్వేచ్ఛావిహారముసల్పి కవికిని
ంకులకును యశో, ధనలాభములం జేకూర్చిన 'మారంగూన్ రౌడి
సంగనివారు లేరు. రౌడీలకెల్ల రవుడీ రంగూన్ రవుడి నెరుంగనివారు
సు. రవుడీలకెల్ల రవుడి మా రంగూన్ రవుడి సాహసవంతములగు
త్యలు, నిరంతర సురాపానములు, సంసారి వేశ్యా తారతమ్య
ులులేని శృంగారచర్యలు, అబద్ధములు, అప్రమాణములు, మారవుడీకి
్యలీలలు. 'రవుడి భార్య పతివ్రత.' అను లోకోక్తిచే అన్నపూర్ణా
ి పతికొరకై యాత్మబలినిచ్చిన మహాసాధ్విగా చిత్రింపబడినది.
గారామ జయరాముల హాస్యములు కడుపుబ్బ నవ్వించును. భర్త
రకై ఉరిశిక్షకు బాల్పడిన సతీ అన్నపూర్ణాదేవికొరకై ఆత్మహత్య
సుకొనిన మారవుడి శంకరరావు విషాదాంత జీవితమే—రంగూన్
ుడి నాటకముగా కీర్తిగాంచుచున్నది. వెల రు 1—0—0

# సావిత్రి నాటకము

(గ్రంథకర్త: శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు)

ఆంధ్రరంగస్థలము లందంతటను అద్భుతముగా ప్రదర్శింపబడు
నాటకపుకీర్తిని వేరుగా వివరింప బనిలేదు. సావిత్రీ సత్యవంతులవి
్మలానురాగము—సావిత్రి దృఢచిత్తము—యముని భయంకరలీల—
విత్రీ, యముల వాదప్రతివాదములు చదివితీరవలెను. అన్నిటికన్న
త్యేకముగ ఇందలి ముద్దులొలుకు పద్యములు అక్షర లక్షలు
యునవి. వెల 1—0—0

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# రంగూన్ రౌడి

(గ్రంథకర్త:—సోమరాజు రామానురావుగారు)

ఆంధ్ర బర్మారాజ్యములందు స్వేచ్ఛావిహారమునల్పి కవికిని నటకులకును యశో, ధనలాభములం జేకూర్చిన 'మా రంగూన్ రౌడి నెరుంగనివారు లేరు. రౌడీలకెల్ల రవుడీ రంగూన్ రవుడి నెరుంగనివారు లేరు. రవుడీలకెల్ల రవుడి మా రంగూన్ రవుడి సాహసవంతములగు హత్యలు, నిరంతర సురాపానములు, సంసారి వేశ్యా తారతమ్యములులేని శృంగారచర్యలు, అబద్ధములు, అప్రమాణములు, మా రవుడీకి నిత్యలీలలు. 'రవుడి భార్య పతివ్రత.' అను లోకోక్తిచే అన్నపూర్ణాదేవి పతికొరకై యాత్మబలినిచ్చిన మహాసాధ్విగా చిత్రింపబడినది. గంగారామ జయరాముల హాస్యములు కడుపుబ్బ నవ్వించును. భర్త కొరకై ఉరిశిక్షకు బాల్పడిన సతీ అన్నపూర్ణాదేవికొరకై ఆత్మహత్య చేసుకొనిన మా రవుడి శంకరరావు విషాదాంత జీవితమే—రంగూన్ రవుడి నాటకముగా కీర్తిగాంచుచున్నది. వెల రు 1—0—0

# సావిత్రి నాటకము

(గ్రంథకర్త: శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు)

ఆంధ్రరంగస్థలము లందంతటను అద్భుతముగా ప్రదర్శింపబడు ఈ నాటకపుకీర్తిని వేరుగా వివరింప బనిలేదు. సావిత్రీ సత్యవంతులవి నిర్మలానురాగము—సావిత్రి దృఢచిత్తము—యముని భయంకరలీల—సావిత్రీ, యముల వాదప్రతివాదములు చదివితీరవలెను. అన్నిటికన్న ప్రత్యేకముగ ఇందలి ముద్దులొలుకు పద్యములు అక్షర లక్షలు చేయునవి. వెల 1—0—0

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# సతీ సక్కుబాయి

ఇది ఆంధ్రదేశపు జనుల భాగ్యవశమున వెలువడిన యమూల్య నాటకమణి. సక్కుబాయి నాటకము చేతియందున్న వారిపాపములు భస్మమై పోవుననుట నిస్సందేహము. ఈ నాటకరాజమునందలి పద్యమొక్కటి చదివినవారు స్వర్గలోకమందు దేవతలచే బొగడబడు చుందురు. సక్కుబాయి పతివ్రతామతల్లి, భగవంతునిచేత నత్తగారికి సేవ చేయించిన గారడికత్తె- శ్రీకృష్ణుని సవతిగా జేసికొనిన నెరజాణ - పాండురంగని భార్యగాఁజేసి తన మగనికి సౌఖ్యమొసంగిన మంత్రివాదిని- భక్తిరస రసాయనము లోకములో వెదజల్లి, జనుల యజ్ఞానరోగమును రూపుమాపిన గొప్పవైద్యురాలు- అమాయకుఁడగు తనభర్తను సకల విధముల సేవించిన పుణ్యాత్మురాలు - యమదూతవంటి యత్తగారిచేత కోరంటికముపడి, యామెను పాండురంగని భక్తురాలిగాఁజేసిన తపస్విని.

అనేక సలక్షణ మహానాటకములువ్రాసి కీర్తిగడించిన సోమరాజు రామానుజరావుగారు యీ నాటకరాజమును రచించినారు. ఇందలి పద్యములు అమృతపు గుటికలు, యిందలి కావ్యములు మామిడి పండు ముక్కలు, యిందలి భావములు పటికబెల్లపు పలుకులు. ఇందలి అక్షరములా అక్షరములే. వేయేల? దీని ప్రాశస్త్యమును చెప్పుటకు వేయినోళ్లుగల యాదిశేషుఁడు అవతరించవలసినదేగాని, మావంటి వారి కలవిగాదు. త్వరపడుడు. మించినపిమ్మట యోచించిన లాభము లేదు. మహాలక్ష్మి ముంగిటకువచ్చి తొంగిచూచినట్లు ఈ నాటకలక్ష్మి పుస్తకరూపమున సరస్వతీ బుక్కుడిపోను అలంకరించినది.

వెల రు 1—0—0

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.